# వైజయంతీవిలాసము

అను

## విప్రనారాయణచరిత్రము.



ఇది

సారంగు తమ్మయామాత్యునిచే

రచియింపఁబడి

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే సరిచూడఁబడినది.



కొండపల్లి వీరవెంకయ్య,

బుక్ సెల్లర్ అండ్ పబ్లిషర్సు,

రాజమండ్రి.






కాకినాడ:

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1926

వెల 0—12—0.

శ్రీరస్తు.

# పీఠిక.

వైజయంతీవిలాస మను విప్రనారాయణచరిత్రము నాల్గాశ్వాసముల ప్రబంధముగా రచించినవాఁడు సారంగు తమ్మయ్యకవి. ఈతఁడు కావ్యాంతగద్యమందు "శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజ గోత్ర పవిత్ర శ్రీరామచంద్ర కరుణాతరంగిత వైభవ సారంగు నృసింహ మంత్రిపుంగవతనూభవ" యని వ్రాసుకొనియుండుటచే నీతఁ డాపస్తంబసూత్రుఁడు భారద్వాజగోత్రుఁడు నృసింహుని కుమారుఁడునైనట్లు తెలియుచున్నది. కాని యీతఁడు నియోగియా మధ్వుఁడా యని శంక గలుగుచున్నది. ప్రబంధము వ్రాసిన ప్రతికవిని నియోగి యని వ్రాసిన వీరేశలింగముగారీకవినిగూడ నియోగియే యని వ్రాయుట వింత కాదు. సారంగువారు మధ్వులు. లౌకికవ్యాపారపారీణులు. గోలుకొండను గరణికం బొనరించెడువారు. కావుననే వారు యమాత్యాది నామముల వాడుకొనియుండవచ్చును. అంతమాత్రముచేఁ దన పూర్వుల "కమాత్యాదిపదములను జేర్చుచువచ్చుటచేతఁ, గవి నియోగి బ్రాహ్మణుఁడు కావచ్చునని తోఁచుచున్నది." అని వీరేశలింగముగారు తమ కవులచరిత్రమందు వ్రాసియున్నారు. ఇది యెంతయు సాహసము మఱియు, వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారు వైజయంతీవిలాసమునకుఁ బీఠిక వ్రాయుచుఁ గవి నియోగి యని వ్రాసియున్నారు. బహుశః వీరేశలింగముగారి కవులచరిత్రమును జూచి వ్రాసియుండోలు! కాని మొదల వారు వ్రాసిన యీవిషయమును గొంతవఱకుఁ ...ంచి సారాంశమును దమ యభిప్రాయముతోఁ గలిపి యిదమిద్ధమని వ్రాసి సందేహనివృత్తిఁ జేసియేయుందురు. అట్లు వ్రాయకపోవుటచే నిదియును బ్రమాణముగా నెంచుటకు వలను కాదు.

ఉ. తన్మనయుంబుఁ బ్రోచుటకు ధారుణి బంధులు బంధు పారిజా
తమ్మన రామభక్తిఁ గలతార్కికులు ... ... ...

అని తమ్మయ తనతాతను రామభక్తి గలతార్కికులనుటచేతను,

గీ. తమ్మమంత్రి గాంచెఁ దిమ్మాయియందు, నం
దనుల శౌర్యసింహు నారసింహు

అని యతని భార్యను తిమ్మాయియని మధ్వులు వాడు నామమును వాడుటచేతను యీతఁడు మధ్వుఁడేల కాఁగూడదో తెలియుటలేదు, ఈసందేహములు వీరేశలింగముగారికి కలుగకపోలేదు.

ఇందుఁ గథానాయకుఁడైన విప్రనారాయణునకుఁ దొండరడిప్పొడియాళ్వారను నామాంతరము గలదు. తొండరడిప్పొడి యనఁగాఁ బాదరజ మని యర్థము. భక్తుఁడైన విప్రనారాయణునకు శ్రీరంగేశుఁడు సాక్షాత్కరించి,

"అనఘ తొండరడిప్పొడి యనఁగఁ బరఁగు
నీకు నాళ్వారి పేరు నాఁ గాక"

అని యాశీర్వదించెను. ఇట్టి పరమభాగవతోత్తముని భవ్యచరిత్రమును వ్రాసిన సారంగు తమ్మయ్యజీవితమును వ్రాయుచు వీరేశలింగముగారు—

ఉ. చోరుఁ డనంగ రాదు గురుసొమ్ములు ముచ్చిలినం బ్రపన్నునిన్
జారుఁ డనంగరాదు వెలచం బరకాంతలఁగూడి నీచనా
చారుఁ డనంగఁగూడ దనిశంబును వేశ్యలతో రమించినన్
బోరున మీరలాతనికిఁ బూనుఁడు బ్రహ్మరథంబు వైష్ణవుల్
చతు

అను పద్యమును నుదహరించి "ఇటువంటి సిద్ధాంతములే దేశములో నీతికిని మతమునకునుగూడ నమిత మైనచెఱుపును గ[illegible] జేయుచున్నవి. నీతిని విడిచినమత మెప్పుడును దేవునికిఁ బ్రీతికర[illegible]

కానేరదు" అని కవులజీవితములలో వ్రాసిరి. ఈపద్య మేసందర్భములో నేపాత్రములచేతఁ జెప్పింపఁబడినదో యావిషయము లేశమైనను సరిచూచుకొనకుండఁ దమచిత్తానుసారముగ వ్రాసిన యీవ్రాఁతలు చదువరుల నట్టిదుర్మోహములపాలై జేయునో వేఱుగఁ జెప్పవలెనా? నేరమును మోపి శిక్షింపఁ దలవరియొద్దకుఁ దెచ్చిన విప్రనారాయణుని గని యితర మతములవారలు వెగతాళిగఁ బల్కినపలుకులు పై పద్యములోనివి. అవి సిద్ధాంతవాక్యములు కావు. చదువరులకు సందర్భము తెలియుటకై గ్రంథమునుండి యాఘట్టమునందలి వాక్యముల నీక్రింద నిచ్చుచున్నాను.

వ. అని యిట్లు హరిదాసు లయిన శ్రీవైష్ణవజనంబులు మనంబుల ఘనం బగుఖేదంబు లొందుచుండ నవ్వల నితరమతంబులవా రతని నుద్దేశించి. 99

ఉ. చోరుఁ డనంగరా దొరులసొమ్ములు ముచ్చిలినం బ్రపన్నునిన్
జారుఁ డనంగరాదు పెలుచం బరకాంతలఁ గూడ వీఁ డనా
చారుఁ డనంగఁగూడ దనిశంబును వేశ్యలతో రమించినన్
బోరన మీర లీతనికిఁ బూనుఁడు బ్రహ్మరథంబు వైష్ణవుల్. 100

వ. అని సొల్లుంరవను లాడుచుండి రాసమయంబున జియ్యరు సభాసదుల కిట్లనియె 101

పై దానింబట్టి చోరుఁ డనంగరాదు మున్నగువాక్యములఁ బరమతస్థులు వైష్ణవమతస్థులఁ బరిహసించుటకై పలికినపలుకు లని గ్రంథమందు స్పష్టముగఁ దెలుపంబడియుండె. ఆసందర్భము దేనిని జూచుకయె వీరేశలింగముగారు వానిని వైష్ణవమతస్థుల సిద్ధాంతవాక్యములుగాఁ దీసికొని పరిహసించుట వింతను బుట్టించుచున్నది. నిజముచే వైష్ణవమతస్థులు విప్రనారాయణుని పతనము తమ కవమానకరముగా నున్నట్లే గ్రంథము చెప్పుచున్నది.

వీరేశలింగముగారుకూడ నితరమతమువా రగుటచేత నేకాఁ బోలు విప్రనారాయణచరిత్రము నీతిబాహ్యముగా నున్నదని వ్రాసిరి.

ఈగ్రంథము నీతిబాహ్య మని మొదట వీరేశలింగముగారు నిందించినను యిటీవల దీని నీతిదాయకముగా నెంచి తాము స్వయముగా సంస్కరించి ప్రకటించియున్నారు. ఆప్రకటనమున కగుఖర్చును పెట్టుకొనిన గున్నేశ్వరరావుసోదరులు తమగ్రంథమునకుఁ బీఠిక వ్రాసి యందిది నీతిదాయక మని యీక్రిందివాక్యములలో నుద్ఘోషించియుండిరి.
"నీతిబోధక మగు నీవైజయంతీవిలాసమును"

మొదట నీచగ్రంథ మని యధిక్షేపించిన వీరేశలింగముగారే మరలఁ బరిష్కరించి ప్రచురించుట వారి యనుయాయు లగుగున్నేశ్వరరావుసోదరులు నీతిదాయకమే యని ఘోషించుట జరుగుటచే పంతులవారి మొదటియాక్షేపణము రద్దైపోయినది.

కాని చిత్రాభ్యుదయపీఠికలోఁ దద్గ్రంథకర్త వైజయంతీవిలాసమును నీక్రిందిరీతి మరల నధిక్షేపించెను. "తద్గ్రంథకర్త (సారంగు తమ్మయ్య) భగవంతుఁడు భక్తవత్సలుఁ డని నిరూపింపఁ బూనికొని, విప్రనారాయణుఁడు వివేకమంతయుఁ బోఁగొట్టుకొని వేశ్యావియోగము కొఱకుఁ జింతించుచుండ, భగవంతుఁడు చౌర్యము సలిపి మరల నతని నవ్వేశ్యకుం దార్చె నని కల్పించెను. ఇది యెంతనీతిదాయకముగా నున్నదో విచారింపుఁడు"

వైజయంతీవిలాసమునందు తద్గ్రంథకర్త భగవంతుఁడు భ[illegible] వత్సలుఁ డని తెలుప నుద్దేశించినాఁ డని వీ రంగీకరించిరి. కాని యం[illegible] కై చెప్పినయంశమునూత్రము నీతిబాహ్య మనిరి. పరమేశ్వరుని [illegible] వత్సలత్వాతిశయమును లోకమునకుఁ జూపుటకై దోషులను కా[illegible] పాడినట్లు కవులు తెల్పుట కలదు. అట్టివ్రాఁతల తాత్పర్యము దే[illegible] భక్తవత్సలత నవ్యక్తీకరించుటగాఁ దీసికొనవలెనుగాని విపరీతార్థము[illegible]

చేసి నిందింపరాదు. అట్లుచేసిన సారస్వత మంతయు దోషదూషిత మగును. ఇందులకై మన చిత్రాభ్యుదయగ్రంథకర్తగారి వ్రాఁతనుండియే ప్రమాణముఁ దీసికొందము. ఈమహాకవి చింతామణి యనునొక క్రొత్తనాటకమును వ్రాసియుండెను. అందా వేశ్య పరమదుర్మార్గురాలిగఁ జిత్రింపఁబడెను. అట్టిదుర్మార్గురాలియందు భక్తవత్సలుఁ డగుభగవంతుఁడు కరుణను వహించి పనిపట్టికలలోనికి వచ్చి హితబోధ కావించి యిహమున నే యామెబ్రమకును నానందదాయకము గావించె నని చెప్పఁబడియున్నది. అంతియేకాదు, మహాపతివ్రత యగు రాధ (బిల్వమంగళపత్ని) మర్మరణముపా లైనట్లును, దరువాత నీశ్వరునికరుణకుఁ బాత్రురా లైనట్లును లిఖింపఁ బడియుండె. ఇంకను బహుకాలము ఘననీతివర్తనముగలిగి గ్రహచారవశమున నించుక పతనముపా లైన లీలాశుకుని యందు నీదేవదేవునకు వేశ్యపై వచ్చినంతకరుణ రాలేదు. మొదటినుండియుఁ బరమహేయచరిత్ర యై, లోకవంచనము చేసిన వేశ్యకుఁ బ్రత్యక్షమై యామెను బాతురాలిని జేసి యీయామెద్వారముగా బిల్వమంగళుఁడు బాగుపడునట్లు చేసె.

ఇది నీతినిబోధించుక్రమమా యనిన యాగ్రంథకర్త యేమి చెప్పును? దీని నధిక్షేపించువారి యాక్షేపణము లన్నియు నిస్సారములై వారినే బాధించుచున్నవి గావున, గున్నేశ్వరరావుసోదరులు తెల్పినరీతిగా దీనిని నీతిదాయక మగుగ్రంథ మని గ్రహించుటయే ధర్మము. భగవంతుఁడు భక్తవత్సలుఁ డని తెల్పుటకై యిది వ్రాయఁబడినది. దలికథ యెల్లరకును దెలిసినదగుటచేఁ దద్విషయమై వ్రాయలేదు. శ్వామిత్ర వసిష్ఠమహర్షు లిరువురు తగవులాడుకొని నడుమ హరిశ్చంద్రుని బలుబాములఁ బెట్టినట్లే యింపు దేవదేవి మధురవాణి యనునిరువురు వేశ్యలు తగవులాడుకొని మధ్య పరమభాగవతోత్తముఁ డైనవిప్రనారాయణుని బికితునిగాఁ జేసినకథ యిది. కవిత్వము ద్రాక్షాపా

కము. మృదుమధురశైలిని గ్రంథ మలరారుచున్నది. శైలికి రెండు పద్యములుమాత్ర ముదహరించుచున్నాను.

శా. ఆవిప్రోత్తము వజ్రపంజరనిభం బై నిశ్చలం బైనస
ద్భావం బంగనసాహచర్యగుణసంపర్కంబునన్ లోహ మై
గ్రావం బై దృఢదారువై తరుణవృక్షం బై ఫలప్రాయ మై
పూ వై తన్మకరంద మై కరఁగెఁ బో పో నీళ్ళకుం బల్చ నై. 139

సీ. నీపట్టెతిరుమణి నీతిరుచూర్ణంబు
గణికకు వెండిబంగారు లౌనె
నీపుట్టగోఁచియు నీకావివేష్టము
ల్వారకాంతకుఁ బట్టుచీర లౌనె
నీముష్టిగూడయు నీతులసిసరులు
వేశ్యకుఁ బాడుగు పేఁట లౌనె
నీవేదశాస్త్రము ల్నిసంధ్య జపములు
లంజెసానికిఁ బంజలగము లౌనె

గీ. పెట్టనోపితివా యెప్ప ట్టెట్టె యుండు
పెట్ట లేకున్న విచ్చేయు పెండలకడ
మొదల రోయింతులకు నొక్కముదుపె గాక
సీసదాచార మే లయ్య దాసరయ్య. 10[illegible]

కాకినాడ,
17—5—26.

ఇట్లు విధేయుఁడు,
కోటమర్తి చినరఘుపతిరావు.

శ్రీరస్తు.

# వైజయంతీవిలాసము

అను

# విప్రనారాయణచరిత్రము.



## ప్రథమాశ్వాసము.

### అవతారిక.

శ్రీవసుధాసుతాంఘ్రి నివగింప శిరీషదళోపమాన మి
...ఘ్నానరు కేళ్ని సర్గగుణకర్కశ మశ్మము మెట్టఁ బల్కె నె
ట్లీవసుధాధరుం డనుచు నింతులు పల్కఁగ నంటఁ గొంచులో
కావనుఁ డైనపెండ్లికొడు కస్మదభీప్సితముల్ ఘటించుతన్. 1

చ. జను లరుదంద నాఘనుఁడు చాపలతన్ దరియుంగఁ జూచి లో
నినుపఁగఁ గూర్మినీడఁను నెమ్మి రహిన్ బరివిప్ప సయ్యెడన్
గనుఁగొను వారికి న్నలిగెఁగన్నులపంట వటంచు నెచ్చెలుల్
ననుపులు పల్కఁగ న్గొనల సర్వధరాసుత మమ్ముఁ బ్రోచుతన్.

చ. మిహిరతనూనపాద్యతుల మించి సముచరుదారశక్తిచే
బహిరబహిస్తమస్తతులఁ బాపుచు శేషశయానుకార్యని
ర్వహణసమర్థ మై యతిపరంపరఁ బెంపెసలార్చు నమ్మహా
మహము సుదర్శనం బెపుడు మత్కృతిఁ గూర్చుఁ బ్రసన్నభావమున్. 3

క. అమరఁగ నేఘను శేష
త్వము తగ శేషిత్వ మర్థవంతం బగుఁ ద
త్కమలాక్షున కట్టిసహా
స్రముఖుండు వచఃపరంపర ల్గృప సేయున్. 4

శా. దాసుం డై సఖుఁ డై తురంగ మయి చిత్రచ్ఛత్రి మై మేలుక
ట్టై సింహాసన మై సుమవ్యజన మై యంకోత్తంసం బై రమో

ల్లాసిం జేరి భజించు వేదమయుఁ గళ్యాణప్రదు న్గీర్తిము
దాసీమంతవతీమనోహరు గరుత్మంతు న్బ్రశంసించెదన్. 5

ఉ. వేత్రిలత న్ధరించి యరవిందభవాండచరాచరావలు
ల్చిత్రగతి న్నటించుటకు శిక్ష యొనర్పఁగ సూత్రధారుఁడై
మిత్రశశాంకలోచనుఁడు మెచ్చఁ బరాంకుశవృత్తిఁ జెంది సూ
సూత్రవతీసుచే గవిత చొప్పడుఁగాత నిరంతరాయమై. 6

ఉ. మంజుతరోష్ఠబింబరుచిమద్రదదాడిమబీజపఙ్క్తి లె
క్కర జపఁ జూచి పల్కు చిలుక న్బ్రియము ల్చిలుకం జతుర్ముఖీ
పంజరపాలికి న్బెనచు ప్రౌఢవినోది ఘటించుఁ గావుతన్
గంజముఖుండు మత్కృతిముఖంబున విశ్వజనప్రమోదముల్. 7

శా. వీణాపుత్త్రిలసద్గుణంబులు ముదావిర్భావముం జేయఁగాఁ
బ్రాణంబు న్బలె బొమ్మడించక సుధాప్రాయానులాపంబులం
బాణిం గూర్చుచు సారెసారెకు రుచుల్వాటింపఁ బల్కించున
వ్వాణీదేవి నటించు మద్విమలజిహ్వారంగమధ్యంబునన్. 8

ఉ. మాటికి సక్కళంకముఖమండలిఁ జంక్రమణంబుఁ జూపుచో
లేటికి గౌరి మిక్కిలి చలింపఁగ దన్మృగడింభము న్జటా
జూటతలంబున న్బొలుచుసోముని జూపి సుధాంశుఁ బిల్చుచు
న్జోటికి వేడ్క చేయుగిరిశుండు గృప న్మముఁ బ్రోచుఁ గావుతన్ 9

ఉ. ఏదమవిచ్ఛిఖామణు లహీనశయాను బ్రపత్తివాసనా
స్వాదము చేయుచున్ మలయశైలమరుత్తులు తేఁటిరీతి స
శ్రీదయితంబుగా సహచరిష్ణువుఁ జేయుదు రట్టియాదిమ
ద్వాదశసూరివర్యపదంబులు మానసవీధిఁ గొల్చెదన్.

క. వందారుదాసజనతా
మందారు న్వేదశాస్త్రమహితప్రజ్ఞా
బృందారకగురు మద్గురుఁ
గందాళప్పలగురు న్జగద్ధితుఁ గొల్తున్. 1

క. జాతులవార్తల నుపమల
రీతులఁ బదగుంభనల ధ్వనిప్రీతులవి
ఖ్యాతిగఁ గృతు లొనరించుపు
రాతననూతనకవీశ్వరచ్ఛటఁ గొలుతున్. 12

క. గణశుద్ధియు గుణశుద్ధియు
గణుతింపఁగ లేనివారు కవిత లటంచు
న్గణములు దెలుపుకొనంగా
గుణదోషము లెంచ నేల కుకవులయందున్. 13

వ. అని ప్రధానదేవతానమస్కారంబును గురుజనపురస్కారంబును సుక
వివాదనంబును గుకవినిందనంబును గావించి మదీయవచోవిశే
షంబుల రఘువంశవల్లభునిఁ బొగడందలంచినవాఁడనై తదీయ
దాస్యకహితపరివారం బగుమదీయవంశపరికారం బభివర్ణించెద 14

—♦ కవివంశానుక్రమణిక. ♦—

మ. ఇల శ్రీరామునకేమహర్షి వసిష్ఠోనిష్ఠాప్తిచే రాకపో
కలఁ బ్రేమ న్ఘటియించెఁ బర్వతము లై కన్పట్టుపాపమ్ములా
మలకంబుల్పలెఁ గేలఁ గైకొనియె నేమౌనీంద్రుఁ డానిష్ఠుఁడో
జ్జ్వలకల్లోకమహాస్వనూజునకు భరద్వాజుండు తాఁ బెంపగున్. 15

వ. ఆఋషిమిత్రపవిత్రగోత్రంబున. 16

క. శ్రీరంగహిమవదంతర
భూరంగత్కీర్తి యగుచుఁ బొగడఁత కెక్కెన్
సారంగధరుఁడు కీర్తిత
సారంగధరుండు కీర్తి సర్వజ్ఞుఁ డిలన్. 17

సారంగధరుఁడు వెలయఁగ
సారంగునివా రటంచు సచివాగ్రణులై
పేరుం బెంపును గాంచి రు
దారత నయ్యర్థవే లనఁగఁ దద్వంశభవుల్. 18

శా. ఆసారంగధరుండు గంగ మనభార్యారత్నము న్బెండ్లియై
వాసి న్వన్నెయు రా మెలంగి కనియె న్వంశావను న్బావను
న్భాసద్భూమాడ్గుణకావతంసనిరతాభ్యుద్గీతనానాకళా
ధీసంధానసురేంద్రమంత్రి గిరిమంత్రి న్మంత్రిమందారమున్. 19

క. గిరిమంత్రిమౌళిచంద్రుని
తరుణీమణియంకమ్మ గనియె దానకళాభా
స్కరతనయునిఁ ధరఁ దమ్మన
ధరధైర్యు ననూనశౌర్యుఁ దతగాంభీర్యున్. 20

మ. అనఘుం డాగిరిదండనాయకుని తమ్మామాత్యు సద్దానసం
జనితోదారయశోవిలాసములు నిచ్చల్ గేరు మందాకినీ
ఘనసారామృతహారహీరసురరాడ్గంధర్వసంధేభచం
దనమందారసుధాంశుబింబములయందంబుల్ వినిందించుచున్. 21

ఉ. తమ్మనయాంబుఁ బ్రోచుటకు ధారుణి బంధులు బంధుపారిజా
తమ్మన రామభక్తి గని తాత్వికులెల్లరు వీని కాక చి
త్తమ్మనఁ జూపులం దనిసి ధార్మికు లితని దెంతమంచిప్రొ
త్తమ్మన నాగిరిప్రభునితమ్మన మించె నుదంచితస్థితిన్. 22

ఆ. తమ్మమంత్రి గాంచెఁ దిమ్మాయియందు నం
దనుల శౌర్యసిహనారసింహుఁ
జతురబుద్ధిచంద్రు సత్కళాగణచంద్రు
గిరిచమూపచంద్రుఁ గీర్తిసాంద్రు.

వ. అక్కుమారరత్నంబులయందు.

క. సారంగు తమ్మమంత్రికు
మారుఁడు నరసింహమంత్రి మహిమహితకళా
ధారాళదానశోభాదమ
పౌరుషగాంభీర్యధైర్యపటుశౌర్యములన్.

భోగపుఁ డగు నస్మదాదికిఁ బుత్రి జనని
హారికృపాలంబ నరసయ్యయక్కమాంబ 98

చ. అనఘుఁడు తన్నృసింహవిభుఁడా సతి యక్కమయందుఁ గాంచెను
దనుపమవర్తనుం డగు ననంతన మంత్రిశిఖావతంసముం
ఘనుఁ డగు వేంకటాద్రిగణకప్రభుసన్నుతు నం సహోదరుల్
చనువున వామదక్షిణభుజంబులు వోలె సహాయులై తగన్. 29

చ. ఇనసమతేజు లాత్మజుల నెల్ల మహాత్మునకా హి యేలు నీ
యొసబడిన ల్గుదగ్గముల నేలినయేలికి గోలకొండఁ ద
ద్ఘనసగరస్థలిన్ గరణికం బొసఁగించెను దన్మహాత్రి యా
జనపతి రమ్మహాత్మున బ్రజల్ జయవెట్ట గృహస్థులౌ ననన్.30

వ. అట్టివంశంబున మహాత్ముండనై వివిధభోగంబు లనుభవించుచు
నుండ నొక్కనాఁడు 31

సీ. రవికోటిరుచిపెంపు దవిలింపు మణికిరీ
టంబువాఁడు సులలాటంబువాఁడు
ప్రతి లేక తనుజేక భాసిల్లుసిరిపేరి
జోటివాఁడు సువర్ణపాటివాఁడు
కరుణారసము మించు కమలాలి వర్షించు
చూపువాఁ డెన లేనిరూపువాఁడు
పల్లవస్నియులమించు దులకించు డాయూపు
పంటివాఁ డభ్రంబువంటివాఁడు
నగుమొగంబున నెలవంక నలిక మైన
తిరుమణి ధరించువాఁ డొక్కదివ్యపురుషుఁ
డెదుట నిలుచుండి నాపేర నీవు సేయు
కావ్య మంకితమొనరింపు భవ్యసరణి.

క. అని పల్కెనంతలో మే
ల్కని నలుదిక్కులును గలయఁ గన్గొని స్వప్నం

బునఁ గులదైవము రఘుపతి
నను ధన్యుసిఁ జేయ వచ్చినాఁ డని తెలిపెన్. 33

వ. ఆహా మత్పురాకృతసుకృతపరిపాకం బతిమధురమధురసాస్వాదనం బున వెగటుపడుచుండు కట్యావ్యామావికంబు రుచి గొనుచందంబునఁ బురాతనప్రాచేతసముఖ్య మహాకవివచస్సుధారసంబులు గ్రోలు వీనుల శ్రీరామచంద్రుండు మదీయాల్పసారవాక్యంబు లానుటకు నుత్సహించెఁ గృతార్థుండ నైతి మత్సంకల్పంబు సఫలం బయ్యె నని కృతనిశ్చయుండ నై యమ్మహానుభావునకు. 34

—♦ షష్ఠ్యంతములు. ♦—

క. సుభగనిజపాదుకాఖ్య
ప్రభులంబనభూరిరాజ్యపదభరతునకున్
సభయశరణాగతామర
శుభరతునకు నతులసద్యశోభరితునకున్. 35

క. భీరదిక్తటకరటిఘ
టాకటనిర్భేదచాపటంకారునకున్
భూకాంతాపీఠప్రభా
జ్యోతికరకౌశభూజావిటంకారునకున్. 36

[క]. ఖలతాటకావిపాటన
బలదర్పితసన్మహర్షిభావితరక్షః
కులహింసాపేతునకును
[జ]లనిధివైకుంఠతులితసాకేతునకున్. 37

[క. భ]ర్గగణవిక్షోభణ
[ద]క్షోద్భటబాణదాళదళ్యాహతదృ
[ప్య]త్తమదివాంధవిపత్తున
[దీ]క్షణచోనుదత్సహస్రాతునకున్. 38

క. శ్రీమహిళామూర్త్యంతర
భూమిసుతాయోగయోగ్యభువనాద్భుతరే
ఖామంగళాంగజితసు
త్రామమణిస్తోమునకును రఘురామునకున్. 39

వ. సమర్పణంబుగా నభ్యుదయపరంపరాభివృద్ధిగా నభిమతార్థసిద్ధిగా నారచియింపంబూనిన వైజయంతీవిలాసంబునకుం గథాక్రమం బెట్టిదనిన. 40

## —♦ శ్రీరంగపురవర్ణనము ♦—

సీ. నిలిచె నేరాజధానిఁ బయోరుహాసను
సజ్జపూల వసంతశయనమూర్తి
చెందె నేకటకంబునందు సంతతసర్వ
పరిపూర్తితోఁ ద్రిపాద్విభూతి
పుట్టె నేపట్టణంబునఁ దృణద్రుమలతా
మూర్తులై తన్నిత్యముక్తవరులు
ప్రవహించె నేవీటఁ బరిఖావిభూతిని
విరజాసరిత్పంక్తి కావేరిపేర
వేదశృంగంబు నోంకారవిగ్రహంబు
నైన శ్రీరంగదివ్యవిమానరాజ
మెచట నివసించె నిల దాని నెన్నఁ దరమె
పుణ్యనికరంబు శ్రీరంగపురవరంబు.

సీ. ఆసించు నెపుడు నత్యాసక్తి నమ్మహా
నటుఁడు నేనగరిఁ గోణంగి యగుట
వాంఛించు వాగ్వధూవరుఁ డతిప్రేమ నే
పట్టణంబున మూగవారుఁదనము
కాంక్షించు నింద్రుఁ డుత్కంఠతో నేరాజ
ధానిలోపల నుపాదానపరత

కామించు దేవర్షిగణము లేపెనుఁబ్రోలు
శ్వాపదపక్షిమృగాదిజంతువృత్తి
విరజ కావేరి యై పుట్టి పరిఖ గాఁగఁ
బరమపదవల్లభుఁడు రంగభర్తపేర
నాయకుఁడు గాఁగ వైకుంఠనగరి తాన
యైన శ్రీరంగపురము శక్యంబె పొగడ. 42

చ. రమణ జెలంగునన్నగరిరంగవిమానశిఖాంతరత్నకుం
భములు నిజద్యుతిం బొదువఁ బ్రత్యహముక్ జనుహేళిచూచి డెం
దమున సదా భజించు నమదార్చ్యరమాపతియే తదేకర
త్నముగ ననాతరత్నత వృథా యనుచుం దనుపాస్త్ర తేజుఁడై. 43

ఉ. పతితిఁ జంద్రపుష్కరిణి నీతలు వెట్టెను వేల్పుఁజాలుభ
స్నాతృజనాఘముల్ చనెనుచందనుఁ దజ్జలజాతభృంగసం
ఘాతము లుప్పరం బెగయుకై వడియున్ వివరింప నొక్కటీ
రై తెలియుంగ రామి నొకయప్పటికిఁ బరికించు ధ్యానకృతిన్. 44

తే. సారెసారెకుఁ బౌరకర్పూరగంధు
లాడు కావేరినీటఁ బెపైన పైరు
పంటధాన్యంబు లచ్చటఁ బండు గానఁ
బుడమిలో నద్దు కర్పూరభోగు లయ్యె 45

వ. అందు. 6

సీ. అలికాదికాంగంబు లనుగతశ్రీచూర్ణ
ధవళోర్ధ్వపుండ్రశాంధనము నెరప
వదనాంబుజములు దివ్యప్రబంధాను సం
ధానవాసనఁగోడ నాటు సేయఁ
గంఠదేశంబులు కమలాక్షతులసికా
మాలికాసౌహార్దలీలనడప

బాహుమూలములు శుంభత్సువర్ణవాంచ
జన్యలాంఛనమైత్రి సంఘటింప
వాజనంజనశోభనమహాశ్రీ నుజ్జ
దళలచేతనసంరక్షణానతీర్ణ
విష్ణుపర్యాయమూర్తులై వీట నుండ్రు
భాగవతులాత్మవిద్యానురాగనటులు. 47

సీ. రమణీయతేజోవిరాజులు రాజులు
కటుకశాత్రవసమూహ్యాటులు భటులు
నిజబలాధరితదిగ్గజములు గజములు
హరిణవేగజితార్కహరులు హరులు
వివిధక్రతుప్రీతవిబుధులు విబుధులు
కవితాభినుతసురుత్కవులు కవులు
రతిరాజకోటిహృద్రమణులు రమణులు
వరధర్మవర్తకుల్ వర్తకులును
గలిగి కైవల్యఫలదాయకక్షితిందరి
భూమిరుహవల్లి యైనయప్పురమతల్లి
విలయమున నశ్వరము గాక వెలయు నరసి
శాశ్వతంబుగ నేలు నధీశ్వరుండు. 48

సీ. విలయసన్నద్ధగోద్ధదళశాయి శాంబరీ
శాలకుండు త్రిలోకపాలకుండు
కమలాక్షపోలకుంకుమపత్త్రరచనావి
చక్షణుండు గజేంద్రరక్షణుండు
వివిధషోడశసహస్రవిలాసినీమనో
రంజనుండు నిశాటభంజనుండు
సనకాదిసంయమీశ్వరలోచనచకోర
చందిరుండు సుధాబ్ధిమందిరుండు

చరణనీరాజసక్రియాచరణకలిత
సమదమాసఖ శతమఖ ప్రముఖ దివిజ
రాజకోటీర కోటీరరాజితాబ్జ
రత్ననీరాజితాంఘ్రి భుజుఁడు రంగవిభుఁడు. 49

తే. ఆమహాదేవు కరుణాకటాక్షవీక్ష
ణప్రభావంబువలన నిజప్రజలకు
దురితరోగాపమృత్యువుల్ దొలఁగి చెలఁగు
పుణ్యరమతల్లి శ్రీరంగపురమతల్లి. 50

మ. వియదధ్వాన్యమతప్రభూతమహిమన్ విఖ్యాత మై తత్పురో
భయపార్శ్వంబుల నప్రయత్నపరిఖాభావంబునం బొల్చున
క్షయపుణ్యాకరవారి వారినిధికిన్ గారాపుదేవేరి వా
గ్దుహితాదీంద్రకుమారికుంభభవసాధ్వీస్వారి కావేరి యాన్. 51

—♦ నారాయణుఁడను వైష్ణవునిచరిత్రము. ♦—

క. ఆనదిదక్షిణదిశఁ బెం
పై సప్తశతోర్ధ్వ ధరామరనివహా
వాసంబు మండగుడి యన
భూసురపుర మొకటి వెలయు భూసురపురమై. 52

గీ. ఇందిరాసఖుఁ డనుపేర నందు నుండు
నాదినారాయణుండు లోకైకభర్త
ఘోరకలికాల కలుషాంధకారతతుల
పారయకుండఁ గృపాదృష్టి పరఁగఁ జేసి. 53

పారంపర్యసమాగతాన్వయ మను బ్రహ్మజ్ఞ లామ్నాయచూ
రూఢస్ఫుటశేముషీకు లనవద్యర్గోధితానంధ
కారస్వాంతులు నిత్యభాగవతకైంకర్యానురక్తుల్ నవ
రామానుజమూర్తు లప్పురమునన్ శ్రీవైష్ణవాగ్రేసరుల్. 54

ంను. 55

సీ. వేదవేదాంగాదివిద్యాప్రవీణుండు
పరతత్త్వవిజ్ఞానపారగుండు
నిత్యభాగవతార్చనాత్యుత్సుకస్వాంతుఁ
డఖిలజీవదయాపరైకబుద్ధి
యతులితైకాదశీవ్రతనిత్యశీలుండు
ద్వాదశీవాసరోత్సవవిధాయి
యగణితశమదమాదిగుణసంపన్నుండు
త్రిభువనస్తుత్యనిర్మలయశుండు
వంశపారంపరీలబ్ధవైష్ణవాంక
పంచసంస్కారవిభవవిభ్రాజమానుఁ
డాత్మసన్నిహితాదినారాయణాంఘ్రి
యుండు నారాయణాహ్వయుం డొకగృహపతి 56

శా. ఆనారాయణు ధర్మపత్ని పతిసేవాలోలసుశీలతా
నూనప్రోద్యద్భాగ్యధుర్య యసమానోదార శృంగార లీ
లాసిస్మేరిత విశ్వలోక మహిళాలావణ్య విహ్రస్వయ
శ్రీనీరాకరలక్ష్మి యొప్పఁ దగు లక్ష్మీనామధేయంబునన్. 57

క. శ్రీరమ్యత సాలక్ష్మీ
నారాయణు లుండుట మనుజనారీపురుషా
కారము దాల్చినలక్ష్మీ
నారాయణు లని జగజ్జనంబులు పొగడన్. 58

వ. ఇట్లాదంపతులు కులశీలజనస్తుత్యచిత్తానుకూలదాంపత్యంబునం బ్రవ
ర్తించుచుండ నొక్కనాఁడు.

సీ. మహనీయనళినాక్షమాలికావలయంబు
కరబోడిశిఖలఁ జుట్టుకొన నమర్చి
శ్రవణాక్షిఖురశృంగసహితమై కప్పారు
సారంగచర్మ మంసమునఁ బూని

పృథులసాలగ్రామపేటీసహిత మైనక
కపాల కక్షభాగమునఁ దాల్చి
కాషాయకౌపీనకలితమస్కరదండ
కుండికల్ చేదోయిఁ గుదురుకొల్పి
యడుగడుగునకు నారాయణా యటంచు
నరుగుదెంచెఁ దదీయగేహంబునకును
మాధుకరవృత్తి తనయాత్ర మహిఁ జరించు
యతివరుం డొక్కరుండు మధ్యాహ్నవేళ. 60

గీ. వచ్చిన యతీంద్రునకును దద్వైష్ణవసతి
భిక్ష తెచ్చిన నతఁ డామృగాక్షిఁ జూచి
యెంచు ననపత్యభిక్ష నే నంద ననుచు
నొల్లక చనంగ నతని కయ్యువిద యనియె. 61

వ. మహాత్మా వైష్ణవగృహంబున దేవపూజానంతరంబున నతిథిభాగంబు విభజించి నాయొసంగిన శ్రీవిష్ణుప్రసాదంబుఁ బ్రాకృతాన్నంబునుం బోలె నుల్లంఘింప దగునే మీ రెఱుంగని ధర్మంబునుం గలదె యేతదర్థంబు చిత్తంబునకుఁ దెచ్చుకొండనిన నతం డది యట్ల కా నిశ్చయించి నెమ్మది నమ్మతిలి యమ్మాధుకరంబుఁ గైకొని చనియె నంత నక్కాంతారత్నంబును యతివాక్యంబు మనంబునకు ఘనం బైన ఖేదంబు నాపాదింపఁ జింతాక్రాంత యై యున్న సమయంబునఁ దదీయభర్త చనుదెంచి తన్మనోవైకల్యంబు గాంచి యిది యేమికారణం బనిన నయ్యింతి యయ్యతివాక్యం బెఱింగించి పతి కిట్లనియె. 62

శా. దాడ్రాయీకుల మంచు నెంచఁ దగు సాధుస్తుత్యవంశంబునన్
బాడ్రిత్నంబునఁ దేజరిల్లు జననంబుం బొందియున్ వేప్రపా
గిడ్రాపోష్యజనాలి కీమె యనుసత్కీర్తిం బ్రకాశించినం
గొడ్రాలైనవధూటిజన్మ మది పేర్కొ నిష్ఫలం బిమ్మహిన్. 63

గీ. దానధర్మము లెన్ని చందములనైనఁ
దగ నొనర్చినఁ గల్గునే సుగతి జగతి
నారలౌకికవైదికాచారనియతు
కలన గలపుత్త్రతిలకంబువలనఁ గాక. 64

గీ. దేహి యని చేయి చాఁచినదేహి కిడరు
మనకు భోగింపఁ దగినజీవన మొసఁగి
నందనానంద మీఁ డాయె నిందిరాధి
పతికి నపచార మేమి చేసితిమొ కాని. 65

వ. అనిన సతికిఁ బతి యిట్లనియె 66

క. కారణము లేక చెందవు
ధారుణి నాపదలు సంపదలు నిమ్ములకై
యారట పడి సర్వేశ్వరు
దూఱుట గోరుటయుఁ దగదు తోయజనయనా. 67

వ. అని నిజకాంత నూఱడించె నారాత్రి వేకువ నయ్యిందువదన
స్వప్నంబున. 68

ఉ. నల్లనిమేను విల్వొతికనామము పచ్చనిపట్టు నాభిపైఁ
దెల్లనితమ్మియుం గలుగు దేవుఁడు కుంకుమవన్నెపుల్గురా
జ్యొల్లని నెక్కి నల్వఁ దెలుపుం గలపుష్పలవంక వెచ్చి యు
త్ఫుల్లనిజాంజలిం జకుకుఁ బోఁడి కొసంగెను సత్కృపామతిన్.

మ. కరుణావారిధి శౌరి దివ్యసుమనోగంధోల్లసత్స్రాక్సమా
దరణం బొప్ప నొసంగ నప్పుడె యహో తద్వైజయంత్యంశవి
స్ఫురణన్ గర్భముదాల్చి పొల్చెఁ గడు నప్పూబోఁడి భాస్వద్ద్యుతి
హరిణాంకప్రతిపక్షశావమానశోభాంచత్ప్రతీచీనుచిన్. 7

వ. ఇట్లు గర్భంబు దాల్చి నవమాసంబులు పరిపూర్ణంబైనయనం
రంబ. 7

## —♦ విప్రనారాయణుని జననము ♦—

క. మాసంబులలోపల నే
మాసము దా నని చెప్పె మున్ను మధుసూదనుఁ డ
మ్మాసమున నింద్రదారక
మాసమ యప్పుణ్యవతి కుమారుం గనియెన్. 72

వ. ఇట్లు జన్మించిన యక్కుమారరత్నంబునకుఁ గ్రమంబున జాతకర్మ నామకరణాదిసంస్కారంబు లొనగూర్చి విప్రనారాయణాభిధానుం జేసి యర్హకాలంబున నుపనీతుం గావించినయనంతరంబున. 73

గీ. వేదవేదాంగశాస్త్రాదివిద్య లెల్ల
గురుముఖంబునఁ జదివి తత్పరత నతఁడు
విష్ణుభక్తుఁ గన్న సేవించుఁ బుడమి
నెరఁగి మీపాదరేణువ నేనటంచు. 74

గీ. భక్తులకుఁ దొండ రంఘ్రిశబ్దమున కిడియు
రేణువునకుఁ బొడి యని యీరీతి ద్రవిడ
భాషఁ బరఁగుటఁ జేసి తద్భాషజనులు
లతనిఁ దొండరడిప్పొడి యండ్రు భువిని. 75

సీ. సాత్వికత్వము పురుషత వహించినరీతి
వినయంబు మూర్తి భవించినట్లు
కరుణ మనుష్యవిగ్రహము దాల్చినపోల్కి
జ్ఞానంబు సాకార మైనభంగి
సత్యంబు పురుషవేషము ధరించినలీల
తాల్మి శరీరవంత మగుభాతి
శాంతంబు మానవజన్మ మెత్తినజాడ
హరిభక్తి తను వొందినట్టిసరణి
సకలకళ్యాణగుణరత్నజలధి యనుచు
వెలయు శ్రీవైష్ణవాచారవిమలబుద్ధి

భగవచ్ఛాస్త్రీయమంత్రిపరమహంసప
రాయణుండైన విప్రనారాయణుండు. 76

క. వనమాలికాంశమున నం
జనితుండగు వాసనావశమున నతఁడె
వనమాలిక లంబుజాక్షు
నకును సమర్పించుబుద్ధి జనియించుటయుఁ. 77

సీ. భూతనిర్మాణైకచాతురి గల్గు న
గ్గాడి నవ్యక్తి విష్ణుఁ డొసఁగె
నజుఁడు నద్దాని నిజాత్మసంభవుఁ డైన
మనువు ప్రార్థింప సమ్మతి నొసంగె
మనువు నిక్ష్వాకు వేఁడిన నేదియొసఁగెను
నర్చించె నాతఁ డయ్యాది యయోధ్య
నిక్ష్వాకుపిమ్మట నెద్ది దాఁ బూజించి
జానకీపతి విభీషణున కిచ్చె
నతఁడు గొనిపోవఁ జంద్రచోళాధిపతికి
నిచ్చినవరమ్ము దలఁచి వాఁ డేలుచోళ
దేశమందున నిల్పె నేదివ్యధామ
మట్టి శ్రీరంగధామంబునందు మిగుల. 78

గీ. ఆదిభోగీంద్రభోగశయ్యాతలమున
నుభయదేవీసమేతుఁ డై యున్న దేవ
దేవుఁ గరుణాపయోధి రాజీవనాభుఁ
బ్రేమఁ బూజించు నవపుష్పదామకముల.

వ. ఇట్లు పూజించుచుండి

గీ. పరులతోఁటలవిరులచే సరుల నొంత
హింపుగా స్వామికే సమర్పించుచున్న

దీసిచేఁ గూలిమాత్రంబె కాని పూర్ణ
ఫలము, రా దని యొక్క యుపాయ మెంచి. 81

క. అమహి శ్రీరంగేశ
స్వామికిఁ బడమటఁ గవేరజాతీరమునన్
భూమకుటం బై తనరెడు
శ్రీమకుటద్వీపమధ్యసీమమునందున్. 82

క. దేవార్చనానిమిత్తము
దా వేలొకతోఁట సేయఁదలఁచి యతం డా
తావృన్దహస్తులచేతన్
వేవిలి సుక్షేత్రభూమి విలువకుఁ గొనియెన్. 83

వ. ఇట్లు గైకొని. 84

గీ అది మఱియు మెత్తగాఁ జన్న యచ్చుగట్టి
విత్తనాల్చల్లి యలరుఁదీవియలయంట్లు
నాటి కారీషరజము సాంద్రముగఁ జల్లి
పసువ కేతాన నెత్తుఁ గావేరినీరు. 85

క. జాజులు చేమంతులు విర
వాదులు మరువేరు కుందవాసంతికలున్
గేదంగులు కరవీరము
లాదిగఁ బ్రోదిగను జేసె నారామమునన్. 86

చుట్టుకంచాది పెట్టించికట్టె నందుఁ
ప్రకముగ మూఁడుచేతులచవికె యొకటి
నేమమునఁ బెంచె దత్పురోభూమిఁ బరమ
వనం బైన యొకతులసీవనంబు. 87
విధంబునఁ బుష్పవాటి నాటించుచు నతండు. 88
స్వాధ్యాయంబు జరించు సాంగకముగా సంధ్యాద్యనుష్ఠానముల్
ధ్యుక్తక్రియ నాచరించుఁ దఱితో వేల్చున్ పవిత్రాత్ముఁడై

మధ్యేరంగశయానమూర్తి కిడు సమ్యగ్భక్తిఁ దోమాలికల్
మధ్యాహ్నంబునఁ గుక్షి బికుఁ దనుపు న్మాధూకరప్రక్రియన్. 89

క. ఈరీతిని శైత్యము తను
ధారకముగ నతఁ డనారతము నేకత మ
మ్మ్యారామముఁ బోషించును
భూరిసమత్సుకత శిశువుఁ బోషించుగతిన్. 90

క. శ్రీధరసేవారతుఁ డగు
నాధరణీసురుని తోఁట నలరించుటకై
సాధుగతి వచ్చెనో యన
మాధవుఁ డేతెంచె వనరమాధవుఁ డంతన్. 91

—వసంతర్తు వర్ణనము—

సీ. మదనప్రతాపాగ్నిమంటలు వోలె తే
మావులఁ జిగురుఁజొంపములు వొలిచె
ననమాయుధునికీర్తి యెసఁగుకైవడి మల్లి
కాకుంజములను మొగ్గలు దనర్చె
స్మరగజకర్ణచామరములై పున్నాగ
ములఁ బ్రసూనగుచ్ఛములు ఘటిల్లె
జలజాస్త్రబలరేణువులు నాఁగ సంపెంగ
గమి మరుద్గతపరాగములు నెరసెఁ
గుసుమబాణాసన ముహుర్ఘుష్యమాణ
కాహళీశంఖపటహఢక్కలతెఱఁగుఁ
దాల్చె నా మ యన మహాధ్వని నునర్చెఁ
గీరకలకంఠ సముదభృంగికులంబు.

సీ. అంగజాయత్తాంతరంగ జాయాకాంత
ఘోరవాయవ్యకింశారుతములు

జరమతంగజపరిస్ఫురదుపహ్వారగిరి
స్వైరసంచారనిర్భరుతములు.
స్మరసమీరకస్విన్నసరసవాహోత్పన్న
భూరిగర్మాంభశ్శరారుతములు
పథికమర్దన మహారథీ మన్మథసహా
యోరువీరవిహారచారుతములు
హరిగతి సంచరించెఁ గావేరికాప్రి
తీర సారసకమలకల్హార కుముద
సార సౌరభ్య సంభార భారవహన
మారపరిచార మధుమాసమారుతములు. 93

వ. అప్పుడు వన్యాభిరామంబులు, వర్ధితయామంబులు, వాచాలశుక
పికస్తోమంబులు, నవమానభృంగంబులు, వాహ్యాళివిహారదనం
గంబులు, సదిగ్ధమలయపవమానంబులు, వర్జితజాతి ప్రసూనం
బులు, వాసితశీతలాంధంబులు, పల్లవరాగధూసరంబులు నైన
యహ్వాసరంబులయందు. 94

క. దివసములు వేలుసు నధికో
త్సవమున నవ్యోష్ణవావతంసము వికస
న్నవమాలికాదిసుమముల
నవమాలిక లిందిరాధినాథునకొసఁగున్. 95

గీ. పాటలాదిసుగంధపుష్పప్రకరము
లామని సృజించె శ్రీరంగధామమునను
హేమపుష్పంబు లలరింతు నే నటంచు
వచ్చెనో యన వేసవి వచ్చెనంత. 96

—గ్రీష్మర్తు వర్ణనము.—

సీ. చండభానుఁడు కర్కటసము చేసి మున్నుదా
మహి కిచ్చునప్పులు మరలఁ గొనియె

వారిపూర్ణము లైన వసుధారకలశముల్
శివలింగమూర్తుల శిరము లెక్క
నృపమందిరములఁ బానీయకుంభంబులు
వెస నట్టెఁ గట్టుక వ్రేలఁ దొడఁగ
భువి నెల్లజనులదప్పులు మాన్పుతక్రంబుఁ
దాఁ దప్పి గొని నీళ్ళు ద్రావఁ జొచ్చె
హరుఁడు కైలాసకుధరసౌధాగ్రవసతి
విడిచి వటమూలతలమున విశ్రమించె
సతతశజదీర్ఘతాళసూకృతనిదాఘ
హరము లగునట్టిగ్రీష్మవాసరములందు. 97

మ. నవధూళీపరిశీతానధూసరితనానాదిక్కమై భాను వై
భవధూతాతతవారిపూర మగునబ్బల్ వేసవి న్వాసవి
యవధూసౌధశిఖావళావళుల నాట్యం బాడఁ జేయున్ దివి
దవధూమధ్వజదహ్యమానగహనోద్యద్భీమధూమచ్ఛటల్. 98

ఉ. వేసఁగివెట్ట గ్రాఁగి పృథివీతల మంతయు వేఁడిమంగలం
బై సెక లీనఁ బ్రాణినివహంబులు లాజలు వోలెఁ బ్రేలఁగా
నాసమయంబునన్ శరణ మై యొకకొండలఁ బ్రోచె ధాత్రిపై
నాసవపాన కించిదవశాబ్జముఖీకుచకుంభశైత్యముల్. 99

వ. తత్కాలంబున. 100

క. శ్రీరంగవిభుని సేవకు
సారాంగన లవనిఁ బణ్యసతు లైగో నా
మారాంగబలము లైతగు
వారాంగన లుండ్రు రంగవసతి నసంఖ్యల్. 10

—♦ దేవదేవి యనువారాంగన వృత్తాంతము. ♦—

సీ. పలరాజు శృంగారవనములోఁ గ్రొమ్మావి
కందర్ప మాయలమందుక్రోవి

చిత్తజన్మునకు పటశ్రేణి కిచ్చిన యీవి
మదనసామ్రాజ్యసంపదలదీవి
కమలాతనూజరాజ్యరసపువడబావి
జలజాస్త్రుచెక్కెంపుసన్నకావి
పుష్పకేతనువలపుల యేటివడుదీవి
శంబరారాతియార్జనపు తీవి
దాని సౌందర్యమున కీవిధాతసృష్టి
సరి సముం బీడు జోడెన్న సతులు గలరె
పచ్చవిల్కానికిం గల్గి వచ్చె రంగ
భూపసతి నన్న రతిదేవి దేవదేవి. 102

గీ. అనుచు హిమశైలసేతుమధ్యమునఁ గల్గు
ధాత్రిజనులెల్ల వినుతింపఁ బాత్ర మయ్యె
విటమృగాఖేటపర్యటద్విషమబాణ
ముక్తమాయాకురంగి సమ్మోహనాంగి. 103

గీ. ఆతరుణి మక్క బహునృత్యగీతవాద్య
దక్షు లెన్నిక వలరాజసంముఖక
ధరనహీ పతిత దానసౌందర్యకునకు
మహితశృంగారరసవేణి మధురవాణి. 104

గీ. అర్థి నయ్యక్కయును జెలియలును నృత్త
గీతవాద్యాదిరూఢిఁ బ్రఖ్యాతమైన
మేళ మొనరించుకొని ప్రొద్ది మెళసి చోళ
విభుని విచులాధిపతిఁ గాంచు వేడ్క నరిగి. 105

కాంచి రయ్యింతు లంభోధికాంచిరమణి
కొప్పునాణెక్య మనుప్రోల్క కొప్పుదాని
దంభదై తేయ కుంభిమర్దనకపర్ద
మండలీఖండవిధుసుధామధుర మధుర. 106

కో యని మ్రోసె నద్దమునకుఁ బ్రతియై శశి తాఱె నుజకెం
పాఱుత మయ్యెఁ బ్రాచి నుదయాచల మెక్కెఁ బయోజబాంధవుం డుకన్.

వ. అంతకుమున్న మేల్కాంచి సమయోచితకృత్యంబులు దీర్చి. 112

సీ. ముఖమజ్జన మొనర్చి నఖ రేఖ రేఖగాఁ
గమ్మకస్తూరినామమ్ము దీర్చి
నునుపుగాఁ దల దువ్వి నవలదండలు దాల్చి
పాలు పైనకోంకొప్పులు ఘటించి
సొమ్ములు నెమ్మేన నెమ్మిగా నిడి వింత
యందంబుగాఁ దావిగంద మలఁది
పావడకంగు పై పైవన్నియల గుఱ్ఱ
వలిపెంపు మడుఁగువల్వలు ధరించి
కప్పురపుఁదావి చిలుకుబాగా లొసంగి
యడపకత్తెలు తెలనాకుమడుపు లొసఁగ
సందియలు మ్రోయ నాస్థాన కరుగుదెంచి
రంతు లలకంతుపట్టంపుదంతు లనఁగ. 113

క. భూరమణుఁడు కొలువిచ్చి హ
జారమ్మున నూతుపట్టిసము యు నెఱిగి యొ
య్యారంబున నభినవశృం
గారంబులు మెఱయఁ జని పరిగద్భ మీఱన్. 114

—♦ దేవదేవి మధురవాణీసహితయయి రాజసభ కేఁగుట. ♦—

విధుబింబాస్యలు గాంచి గున్నతచతుర్ద్వీపసముద్యద్విలా
సమురాంచల్లవణేక్షుసాంద్రమదిరాసర్పిర్దధిక్షీరసీ
రధునీశాసుచిరత్న రత్నరశనా రాజత్కటిస్ఫారవి
శ్వధురారక్షణదక్షిణభుజవ్యాళేంద్రుఁ జోళేంద్రునిన్. 115

వ. కని వసంతసమయవికస్వరపికస్వరమాధురీమాధురీణ నిరాఘాట
చాటువాగ్వైఖరీసుధాసారంబునం దత్సభాగారంబున దైవారఁ గైవా
రంబు గావించి తదీయనిర్దేశంబున నచ్చిత్రప్రదేశంబున నాసీనులై. 116

చ. సవరఁగ వీణె గైకొని భుజంబున నొండొక కాయ యుస్నజాం
కవసతి నొక్కకాయయుఁ దగం బొసఁగించిన రెంటిసంగమున్
గువలయనేత్రి నేత్రకుచకుంభము వోల్చు ధృతిం దృతీయమై
గపిసెన తోడి నామగమకంబుగఁ దత్సరసోజ్జ్వలాకృతిన్. 117

సీ. శ్రవణసంతుష్టమౌటు సవరించి మునివేళ్ల
మృదురీతిఁ బైతీఁగె మెఱుఁగు సేయు
శ్రుతులు షడ్జాద్యైనచో ద్రింతి బిగవుగాఁ
బిగించి గటగిట బిరుడ ద్రిప్పు
గోట సూనంబుగాఁ బాటలోపలఁ జేర్చి
చిటివ్రేలఁ దాళసంఘటన నడుపుఁ
బరఁగించు నప్పటప్పటికిని గద్దెపై
గెంటనం బైనక్రేఁగంటిచూపు
పొసఁగ నిజహస్తములను నింపొలయఁ జిత్ర
భంగి వినిపించు గీతప్రబంధతతులు
చేతనాచేతనములు సంప్రీతిఁ గరఁగఁ
జంచలేక్షణ వీణె వాయించునపుడు. 118

క. ఏణాయతలోచనన, ప్రాణాయతచిత్రగాత్రిపాంచాలిక యై
వాణియు యీయాపో యన
వీణియ వాయించె నొగిఁ బ్రవీణత మెఱయన్. 119

వ అంత నమ్మహీకాంతుం డెంతయు సంతసిల్లి యయ్యింతులకు కుముగ
రలొసంగి విడుదుల కనిపిన దేవదేవిం జూపి మధురవాణి మహీ
జాని కిట్లనియె. 120

ఉ. బాలిక రంగశాయిగుడిపాత్ర నృపాలవరేణ్య నీవుమా
పాలికి రంగశాయివి కృపామతి నానతి యిమ్ము మాపునం
గేలికి నాట కన్న నృపకేసరి యట్ల యొసంగ భూమిభృ
న్మౌళికిఁ గేలు మోడ్చి చని మాహటికొల్వున నావిలాసినుల్. 121

వ. నర్తనసన్నాహంబునఁ దదనుకూలంబైన మేళంబుతోఁ జనుదెంచి
నృపాలునింగాంచి నిజోచితస్థానంబున నిలిచిన. 122

చ. అనుదినగ వాద్య విద్య బిరుదందినహాయిదకారు లత్తతిం
గరముల రెంకు నొక్కసరిగా మురజంబులు మట్టి దిమ్మున
న్మొరయఁగఁ జేసి కాంస్యరవము ల్చెలఁగ న్నియతావధాను లై
సరి విని పిచి రు క్తగతి జంపెధ్రువాద్యటముఖ్యతాళముల్. 123

వ. అంత 124

క. రంజితపదమంజీరక
శింజితము చెలంగ రంగసీమ నిలిచిపు
ష్పాంజలి యు వసుమతీపతి
కంజలియు నొనర్చి సభికు లభినుతిసేయన్. 125

క. లోలసమీరకకిశోరక
లాలసవిహృతి క్రియాచలాచల దీప
జ్వాలిక పోలిక నిలిచెఁ
బాలిక నృత్యాదిఁ దత్సభాగారమునన్. 126

వ. ఇట్లు నిలిచి.

మహాస్రగ్ధర. తపఁణింపన్ ముమ్మురంబై తవఁణి
మలహాగల్ ధాకితాడంబరస్ఫా
ర్తి విజృంభింపంగ రంగోర్విని బిరుదు
పచారించి యచ్చాటుకారుల్

సొంపుదప్ప పాత్రిరాయా యహాహ
బళీ బళీ యంచుఁ బెల్లెచ్చరింపన్
రవలి స్ఫూర్తించెఁ గాంస్యారవము
ఘనముఖారావ భావానువృత్తిన్. 128

సీ. నాగస్వరంబుగానము భుజంగిఁ బోలె
గీత మంగమున సంగీకరించి
హస్తవిన్యాసప్రశస్తవిభ్రమముల నయ
మొప్ప నర్థాభినయముఁ జూపి
వివిధవీక్షణవిలాసవిచిత్రనటనలఁ
బాటించి భావంబు తేటపఱచి
చరణనూపురఘణాఘణనాదంబులఁ
దాళమానము దీపితంబు చేసి
లాస్య మొనరించె నక్కమలాస్య యపుడు
కోపు కోపున దొరలెల్ల దోఁపు లొసఁగ
నాయకుఁడు మెచ్చి బళి బాపురే యటంచుఁ
గట్నములు పైఁడికోరబాగాలు నంప. 129

వ. అంత. 130

సీ. సవ్యహస్తం బర్ధచంద్రాభినయముతోఁ
గా నంటి కిటికిటిఁ గదియఁ జేర్చి
కొనగోళ్ళ నదటుఁ గ్రిమ్మినట్లే జెముట మాటి
మాటికిఁ దిగిచి పో మీటికొనుచుఁ
జనుకట్టు విప్పఁ జట్టును ఘనస్తనకాంతి
చల్లించి యురముపై వెల్లివిరియఁ
గోపఘూర్ణిత మైన కొదమనాగము వోలె
సలఁత సట్టూమ్ము లందంద నిగుడ

నలనవళితంబు లైన కటాక్షవీక్ష
ణాంచలంబులు యువధైర్యకంచుకములు
చించి చీకాకు పఱిచి విసుచుఁ జేసె
రామ నర్తనకేళీవిరామవేళ. 131

మ అపు డాచోళవసుంధరాధిపతి నానానర్ఘ్యభూషాంబరా
దిపదార్థప్రకరంబు త్యాగమహిగా దీనారము ల్వేయు నూ
టపదారుల్ గృపచేసి పంపినఁ బ్రహృష్టస్వాంత లై కాంత లా
నృపతిం గేలు మొగిడ్చి వీడ్కొని నిర్నిద్రప్రియాణంబునన్. 132

గీ. నిజపురము చేరవచ్చు తన్నికటభూమి
విపులతర మైన యొకవటవిటపినీడ
నెంతపడి కాంత మగుదారిక నుండి రచట
నచటఁ దమలోన ముచ్చట లాడుకొనుచు. 133

చ. తరణికులీనలీనవసుధాసురనందనజీవనాయకో
ద్ధరణ రణప్రచారణ సురధామపునఃపరిపూరణోద్ధితా
పరిమితపుణ్య పుణ్యజనభంజనభంజనబద్ధకంకణ
స్ఫురితభుజాగ్ర యోగ్రిదనబోధసుధామృతసింధు బాంధవా. 134

క. దివిజకిరీటితపదప
ల్లవ సేవానిరతభరతలక్ష్మణశత్రు
ఘ్న విభీషణరవినందన
పవనజయువరాణ్ముఖాప్త పరివారజనా. 135

మాలినీవృత్తము.

దశరథకులదీపా తథ్యపథ్యానులాపా
విశదగుణకలాపా వేదవేద్యస్వరూపా
యశరణగణగోపా హావ్యవాహప్రతాపా
నశరశరధిచాపా సాగరోత్పన్న కోపా.

—♦ గద్యము. ♦—

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్ర పవిత్ర శ్రీరామచంద్ర
కరుణాతరంగితవైభవసారంగునృసింహామాత్యపుంగవతనూభవ
పరిచితభగవద్భాగవతకైంకర్యవిధాన తమ్మయాభిధాన
ప్రణీతంబైన వైజయంతీవిలాసంబను మహాప్ర
బంధంబునందుఁ బ్రథమాశ్వాసము.



---

## అత్యద్భుత కుష్ఠరోగనివారిణి.



అష్టాదశకుష్ఠవ్యాధులు నివారించును. శరీరమునకు, స్పర్శజ్ఞానము లేకపోవుట, మొద్దుబారియుంట, ముక్కు, మెడను మొదలగు ప్రదేశములందుండు రణములు, ముక్కు వెంబడి రక్తము కారుట, నిస్సందేహముగా నివారించును. దళసరిగానున్న అరికాళ్ళు, అరిచేతులు, ముఖముపై, చర్మముపలుచనై మామూలు స్థితికి వచ్చును.

కుష్ఠరోగనివారిణి:— సేవించుటవల్ల మేహమువల్ల కలుగు పొడలు, గడ్డలు, రణములు, సర్వమేహవ్యాధులు నివారణయగును. [illegible] దినములకు సరిపడుమందు డబ్బీ రు 5-8-0. ఔషధము పనిచేయు[illegible] అనుమానమున్నచో మా వైద్యశాలకువచ్చి, ఔషధము సేవించ[illegible] గుణము కనబడినకొలఁది వాయిదాలమీద సొమ్ము యియ్యవ[illegible]

వలయువారు:—

ఎన్. ఎస్. శాస్త్రి అండు కం[illegible]

యలమంచిలి, విశాఖప[illegible]

సీ. అనిమిషాధిపునందనవనంబుఁ బోలె
మందారకల్పవృక్షమహిత మగుచు
బాణవైరికుమారుకరసరోజమును బోలె
ఘనపుష్పకాండసనాథ మగుచు
వనజనాభు సుదర్శనచక్రమును బోలె
దివ్యబృందావనోద్దీప్త మగుచు
గగనగంగాతరంగప్రవాహము బోలె
నవిరళామృతఫలోదార మగుచుఁ
బ్రౌఢదివ్యవధూముఖాబ్జమును బోలెఁ
జారుతరకీరమధువారప్రచార మగుచు
వలయు నవ్విప్రనారాయణాఖ్యపుష్ప
వాటి సంకల్పభవకటవాసపేటి 3

వ. కాంచి యంగనలు [illegible] తన్మధ్యప్రదేశంబున. 4.

—♦ దేవదేవీమధురవాణులు విప్రనారాయణుఁ గనుట ♦—

సీ. ప్రణిమాసనపవనకుంభిత మైనమస్తంబు
పెడతలఁ దూలాడు పిల్లసిగయుఁ
దలసి నెత్తమ్మిపూసలగొప్పపేరులు విపుల
రంధ్రములు లైన వీనులఁ జెవ్రలును
నడుపీధి గలనిల్వునామంబుపట్టెలు
శోభితంబగు తిరుచూర్ణరేఖ
వెన్నాలితాపటఁ గీల్కొన్న కౌపీనంబు
వితతంపునీర్కావివేష్టువులును
గలిగి పద్మాసనస్థుఁడై కన్ను మోడ్చి
భగవదారాధనైక తత్పరత నుండు
శ్రీమదష్టాక్షరీమంత్రచింతనాప
రాయణుండైన విప్రనారాయణునకు.

వ. ఇట్లున్న. 6

క. కాంచి యనుష్ఠానము ముఁగి
యించి యరుగునట్టివేళ నెదుట నిలిచి యా
చంచలలోచన లతసికిఁ
గించిద్దూరమునఁ జే మొగిచి మ్రొక్కుటయున్. 7

క. చందురుఁ గనునరవిందము
చందంబున మోము వంచి సంయమికులసం
క్రందనుఁ డా రామద్రుమ
బృందమునడుచక్కి నపు డుపేక్షం జనుదున్. 8

వ. అప్పు డద్దేవదేవి యగ్రిజ కిట్లనియె. 9

ఉ. మ్రొక్కిన నెవ్వ రేమనరు మోమటు వెట్టుక చక్కఁబోయె నీ
దిక్కును జూడఁ డాయె నొకదీవనమాటయు నాడఁ డాయె వీఁ
డెక్కడివైష్ణవుండు మన మేటికి మ్రొక్కితి మమ్మ యక్కడా
నెక్కొని వెఱ్ఱిబుద్ధిమయి నిద్దుర వోయినవానికాళ్ళకున్. 10

వ. అని యిట్లునిరాకరించి పలుకునద్దేవదేవిం గనుంగొని మధురవాణి
యిట్లనియె. 11

ఉ. చూచిన నేమి నీవలను చూడకయుండిన నేమి పూజ్యులన్
జూచిన భక్తి మ్రొక్కుటయె శోభన మీతఁడు బ్రాహ్మణుండు ధా
త్రీచరులందు బ్రాహ్మణుఁడు దేవుఁడు దేవుఁడు నీవు మ్రొక్కినన్
జూచునొ పల్కునో యటులసు మ్మితఁడు స్మరసీమహానవా. 12

తే. బ్రహ్మచర్యమును జపంబు నధ్యయనంబు
హరిదినోపవాస మచ్యుతాంఘ్రి
చింతనముఁ దదీయసేవానురక్తియు
సుదతి జగతి నితనిసొమ్ము సుమ్ము. 13

. లలనా యీతఁ డశోకవృక్షము రసాలంబు న్ప్రియాళంబు వా
విలియుం బొన్నయు బొట్టుగు న్పొగడ కోవిన్ గోఁగు సంపెంగని

దులఁ బోషించుఁడు దోహదంబునకు నింతు ల్వత్తు రప్పుడ సి
ర్కలఁ మించిం తనవచ్చునే యితనివైరాగ్యంబు భావింపఁగన్. 14

వ. అనిన మందస్మితసుందరవదనారవిందయై యయ్యిందువదన యగ్రజ
కిట్లనియె. 15

చ. ప్రకటజితేంద్రియుల్ ధరఁ బరాశర కౌశికులంతవారు స్త్రీ
లకు వశు లంతకంటె మిగులం దృఢమై పుగకచ్చ బిగ్గఁ గ
ట్టుకొనఁగ నీతఁడెంత శుకుఁడో హనుమంతుఁడొ భీష్ముఁడో వినా
యకుఁడొ తలంచుకో సరసిజాయతలోచన నెమ్మనంబునన్. 16

క. ఈనిష్ఠ లింతి తారస
మైనందాఁకా నెసూ సదాచారి యటం
చే నబ్బినదాఁకా నను
మానిజనవిడంబనములు మన మెఱుఁగనివే. 17

క. ఇటువంటి వ్యాలె కారా
చిటుకు మనక యుండ సంజెచీఁకటివేళన్
ఘటచేటీవిటులై యి
క్కటకంబునఁ దిరుగువారు కంజదళాక్షీ. 18

గీ. కదిసి చూడ ఘోటకబ్రహ్మచర్యంబు
పింగళాజపంబు పిల్లిశీల
మజగరోపవాస మలబకధ్యానంబు
నక్కవినయ మిట్టినయము లెల్ల. 19

సీ. ముగ్ధేందువదనలముఖవిలాసములకుఁ
జిగురుఁబోఁడులకు నాశ్లేషములకు
మహిళాజనంబుల మధురభాషణలకు
వనితల నిశ్శ్వాసవాసనలకుఁ
గలకంఠకంఠుల కలికిచూపులకును
బాటలగంధుల పాటలకును

మత్తేభయానల మందహాసములకు
మగువల వాతెఱమధువులకును
నంగనల పాదహస్తవిన్యాసములకు
వెంటఁ బరువెత్తు మునివనవృక్షతతులు
విషయసౌఖ్యస్వరూపవివేకి యైన
నరుఁడు వశుఁ డౌట యేమి యచ్చెరువు జగతి. 20

క. కిలికించితరసపూరముఁ
జిలికించి కటాక్షవీక్షచే నలినాక్షుల్
తిలకించి చూచినప్పుడు
పులకించక నరులదేహములు లోహములే. 21

శా. శ్రీరంగేశునకు న్సదా యితఁడు పూచేరుల్ సమర్పించు టా
హారార్థం బగుఁ గాని పూని సహజం బౌ దేవతాభక్తిఁ గా
దారామంబునఁ గూలి కెవ్వ రిటు సేయం బంచిరో యీయప
స్మారభ్రాంతిమనాత్ము శీల మనుచు న్సమ్యగ్వచోవైఖరిన్. 22

వ. అనినఁ జెలియలికి నప్ప యిట్లనియె. 23

శా. నీరేజాయతనేత్ర నిందితముగా నీ వాడిన న్నీదుజి
హ్వారంగంబున నున్న శారద యసత్యం బాడఁగా నేర్చునే
స్మారభ్రాంతిమదంబు లే దితని కెంచం ధాత్రిఁగాఁ గా నప
స్మారభ్రాంతిమదాత్ముఁ డంచుఁ బలికె న్సమ్యగ్వచోవైఖరిన్. 24

వ. నావుడు నద్దేవదేవి కనుంగొని. 25

స్జితేంద్రియుండు నిష్ఠాపరుం డంచు
నప్ప సారెసారెఁ జెప్పె దీవు
నిఁ బ్రీతిన చెఱిచి విటుఁ జేసి తెచ్చినఁ
లదె పందె మనినఁ గాంత పలికె. 26

వే కా దిప్పారిలో
వేశ్యాపుత్రి యైన నీతని విటునిం

గావింపఁ జాలెనేనియు
నా వేశ్యకు నీళ్ళు కట్టియలు నే మోతున్. 27

వ. అనిన దేవదేవి యిట్లనియె. 28

గీ. అప్పుడో నీకు నేఁ గట్టియలును నీళ్లు
నెంతమోఁచినఁ గాని నా కెగ్గు లేదు
నిన్నుఁ బనిగొనఁగా నాకు నీతి కాదు
వేఱ పన్నిద మొకటి గావింపు మనిన. 29

క. నీ వీవైష్ణవు విటునిం
గావించిన లంజెతనపుగడన విడిచెదన్
గావింపలేక యుండిన
నీవు న్విడిచెదవె యనిన నెలఁతుక యొప్పెన్. 30

క. తరుణీమణు లిద్దరు నీ
కరణిం బన్నిదము నుడివి క్రిమ్మఱ లీలా
సరణిం బురికిం జేరిరి
తరణియుఁ బశ్చిమపయోధిదరికి న్జేరెన్. 31

—♦ సూర్యాస్తమయవర్ణనము. ♦—

క. పెరిగిన చీఁకటి తనుఁ గని
సుఁగి యఱిగి వరుణునగరు చొచ్చిన దానిన్
బోఁగొన వెంబడిఁ దానును
నరిగినక్రియ నినుఁడు గ్రుంకె నపరాంబుధిలోన్. 32

గీ. ధాత్రి దినరాజు పిడిచి పాతాళమునకుఁ
జనుచు వేలంబు వెలుఁగఁజేసిన వెలుంగు
చాయ నెఱసంజ యొప్పెఁ దదీయధూమ
పటలమును బోలెఁ జిమ్మచీఁకటులు మించె.

గీ. అంబరారణ్యమునఁ బ్రవృద్ధంబు లైన
ఘోరతిమిరతమాలభూమీరుహముల

దట్టముగ నల్లుకొని పూచినట్టి మొల్ల
విరులనాఁ బొల్చెఁ దార లయ్యిరులయందు. 34

గీ. వెట్టిచెఱకుఁగోలవింటిబద్దకు మల్లె
తీవెనారిఁ జేసి భావభవుఁడు
పఱచుపువ్వుఁబోండ్ల పెఱచోటుల న్మొత్త
విరులతూపు లేసి మరులు గొలిపె. 35

వ. ఆసమయంబున. 36

చ. పరువడి జారకామినులపల్కులు జారులకుం దదీయవా
క్సరణులు జారకాంతలకు సమ్మతి గా వినిపింపుచుం బోరిం
బోరి నుభయానురాగరసపోషణు లై తెస నిండ సందునన్
దిరుగుదు రానుకోవులగతిం బురవీధుల శంభలీసతుల్. 37

ఉ. కుట్టనికాని వేశములు గోష్ఠతలంబులు తస్కరీమఠం
దెట్టెలు పాడుగోడలు నదీసదనంబులు నిష్కుటంబులున్
గట్టికటీరము ల్పసులగాదిముఱుంగులు గుళ్ళపంచెలు
న్గటనియిండ్లు జారరతి కార్యసమాచరణైక సిద్ధికిన్. 38

వ. తత్ప్రదేశములందు. 39

మ. అసుగంధాంగవిలేపనం బనఖదంతాంకం బతాంబూల ము
ప్రసవాలంకరణం బనుక్తమణితారావం బశయ్యాతలం
బసుఖస్వాప మబంధనైపుణ మసంప్రాప్తాంగసంక్షాళనం
బసిధారాటము నైనజారరతికృత్యం బత్తఱిన్వర్తిలెన్. 40

తప్పులై యేలినవారినిత్యగృహకృత్యం బాతఱుం దీర్చి తేఁ
నవత్తో నిండ్లకు వచ్చునప్పటికిఁ జేర్కొం జక్కనౌరెండుమూఁ
కవిడేలాకులు పోకలుం గొని చిడేట న్గోడపైఁ దత్కుటీ
భవనప్రాంగణసీమఁ ద్రిమ్మరుదు రంభఃకుంభ చేటీవిటుల్. 41

తతఱిఁ బ్రహ్లాదసమ
్వితం బై కువలయంబు విలసిల్లె నవ

ద్యోతసటాపటలుండై
శీతాంశుఁడు పొడిచె నారసింహుఁడు పోలెన్. 42

గీ. దితిజరక్తారుణనృసింహదివ్యమూర్తిఁ
బోలి యొప్పారెఁ బొడుపుఁగొండ విధుండు
తద్విశాలాంకతలదైత్యతనువు వోలె
లాంఛనం బొప్పె నమ్మండలంబునందు. 43

చ. అనిమిషమండలీవిరచితాభ్రధునీసలిలాభిషేచనం
బున విమలాంగుఁడౌ నృహరిపోల్కి సుధాకరుఁ డనంతరం
బునఁ దెలుపొందెఁ దత్సలిలపూరము రోదసిఁ బిక్కటిల్లెనో
యన బలితంబువెన్నెల లజాండవిభాగము నిండె నత్తఱిన్. 44

సీ. చెలువ గట్టిన చీర మొలఁ గొంతఁ గట్టియు
సగము పైవల్లెవాటుగ నమర్చి
పసిఁ బూని రేక దిద్దినకన్బొమల నంటు
గమ్మతావుల కదంబమ్ము నలఁది
లీలగా నూరుదోర్మూలభాగమ్ములు
వాసించు గోవజవ్వాదిఁ బూసి
తనరాక ప్రియుల కెంతయుఁ జాల వినరాని
సాళించు కిఱ్ఱుపాగాలు వెట్టి
చుట్టుపువ్వులసిగలు కస్తూరిబొట్లు
సందితాయెతులును జెంపగందములును
గలిగి సవయస్కులగుకొఁడెకాండ్రఁ గూడి
విటులు విహరింతు రప్పాటి వేశ్యవాటి.

వ. మఱియును.

సీ. అలకము ల్మాటి యూదలపాగ చుట్టి
పై నడ్డకట్టు రుమాలుగుడ్డ కట్టి

చెవులకమ్మలపట్లఁ జవుకట్లు మేలిసీలాల
పోఁగులజోళ్ళు గీలుకొల్పి
యరచట్ట దొడిగి మైసడ్డంబు దిగటంబు
వలిపెకుప్పటి వల్లెవాటు వేసి
నిటలభాగమునందు నిడుసోఁగ తీరుగా
మల్లెపూమొగ్గ నామంబు దీర్చి
ద్రవిడపరిచారకులు వోలెఁ దరుణవేశ్య
లడపములు పూని రాఁ గొంద ఱవ్వేళాది
వెన్నెలంౘారజపుఁబీఁకవన్నె లలరఁ
గంతు గురుపల్లకీసేవ గాంతురంౘ. 47

ఉ. కొందఱు సహ్యజాజఠరకోమలసైకతవేదికావళిం
గొందఱు చంద్రకాంతమణికుట్టిమకేళిగృహాంగణంబులం
గొందఱు మందిరోపరికకుప్పరిపాలితవృక్షవాటికా
ళిందముల స్మనోజసుఖలీలలఁ దేలిరి వారలత్తఱిన్. 48

ఉ. తూరుపు తెల్లవాఱె శశి తోయధిపాలికిఁ జేరె వెన్నెల
ల్తారలతోన జాఱెఁ గుముదంబులు నిద్రలఁ గూరె జక్కవల్
గేరెఁ బ్రసూనసాయకునికి న్బలి తీఱె దిగంతరంబులం
దారెఁ జకోరసంఘము లుదారత మీఱెను సాంధ్యరాగముల్. 49

వ. అంత.

## —◆ సూర్యోదయవర్ణనము. ◆—

మహాస్రగ్ధర. ఉదయక్షోణీధరాధ్యాధ్యుషి
తపిసిత భుగ్వ్యూథ యూధాగ్రహారోద్య
త్కదనత్వ్రోదేవ దత్తార్ఘ్య జలకులిశ
సంఘాత పాతక్షతదా
న్నదవస్మందేహ దేహక్షరదుగు
మధురక్తప్రభామండలీకుం

దుదయించెఁ భాస్కరుం డత్యుపరి
దృశ్యసముద్యోత శోభాస్కరుండై. 51

వ. అప్పుడు. 52

గీ. విప్రనారాయణార్యుని విటునిఁ జేసి
తెత్తు నని పంతమాడిన దేవదేవి
కనకమణిభూషణసుగంధగంధమాల్య
సుపటశృంగారమొడలించి కపటలీల. 53

— దేవదేవి విప్రనారాయణుకడ కేగుట. —

సీ. నడిముక్కుమీఁద సన్నపు నాభినామంబు
నడుమ మంజిడికావి నిడుదరేఖ
యలఁతిపీకుల విచ్చుటాకుల దుద్దులు
సిగ వేసి ముడిచిన చిన్నితురుముఁ
జనుదోయి [illegible] గట్టిన చుట్టుపయ్యెద
కొత్తదోమిన దంతకోరకములు
త్రికముపై నెగఁగట్టు నిగఁగట్టుకువ్వాల్వ
నేలపైఁ జీరాడు వ్రేలుఁగచ్చ
కంఠపార్శ్వంబున సగంబు గానిపించు
తులసితామరపూసలవలుదసరులు
పూని నిక్కంపుదాసరిసానివోలె
విప్రనారాయణాగ్రామవీథిఁ జొచ్చి. 54

వ. తదీయమధ్యప్రదేశంబునందు. 55

క. అమ్మగువ గనుంగొని యెన్
ముమ్మరముగఁ బట్టె రోమములు మేనెల్లం
గ్రిమ్మికొన నట్టెఁ బెట్టిన
గుమ్మడికాయయును బోలెఁ గూర్చున్నతఁడున్. 56

గీ. విప్రనారాయణుని మాల్యవిరచనావ్య
సనపరాయణుఁ జూచి యచ్చటనె పుడమి
నుదురు సోఁకఁగ మ్రొక్కి యయ్యెదుట మోడ్పుఁ
గేలుతో నున్న వేశదాసురాలిఁ జూచి. 57

క. ఎయ్యది కుల మెయ్యది నెల
వెయ్యది నీనామధేయ మిచ్చోటికి రా
నెయ్యది ప్రస్తుత మనినం
దొయ్యలి యాబ్రహ్మచారితో నిట్లనియెన్. 58

చ. అకలుష మైనతావకవనాశ్రమభూమికి శంక లేక హీ
నకులుల కెట్లు రాఁ దగు మనంబున నుంచకుఁ డట్టి దేను శూ
ద్రకులముదాన నంనుచు వితంతువుగా నొకరింట దాసిఁగా
నొకమగనాలిఁ గాను దగు లొం డెద లేను తనంతమానిసిన్. 59

సీ. ధర వర్ణముల కెల్ల గురువు బ్రాహ్మణుఁ డని
యఖిలశ్రుతులుఁ బల్కు నదియు గాక
బ్రహ్మనిర్మిత మైనపరమధర్మము శూద్ర
జాతికి బ్రాహ్మణచరణసేవ
యట్టిబ్రాహ్మణులందు హరిభక్తులు త్రిలోక
పావను లాహరిభక్తులందు
వైష్ణవు లధికులు శ్రీవైష్ణవజనులందు
విజితేంద్రియుండు శ్రీవిష్ణుమూర్తి
యిన్నిగుణములు గణుతింప నిపుడు స్వామి
వలనఁ గలవని మీతిరువడిగు లాశ్రి
యింప వచ్చితి ననుఁ గటాక్షింపు స్వామి
నాథ యెవ్వరు లేనియనాథ ననిన. 60

గీ. తల్లి దండ్రి యన్న దమ్ము లెవ్వరు లేక
యొంటి నింటనుండి యుట్టిపడితె

యింతి యింతకాల మొందుండితి విరక్తి
కిని నిమిత్త మేమి గనితి చెప్పుము. 61

వ. నావుడు నయ్యతివ యిట్లనియె. 62

శా. స్వామీ యేమని విన్నవింతు నతికష్టం బైననాజన్మ మీ
భూమి న్నేఁ బడినట్టిపాట్లు శునకంబుల్ సూకరంబుల్ సహా
గా మున్ పడ్డని లేవు మీరనఁగ సాధ్వీంగనాధుండు దో
ఙ్ఞో మీముందఱఁ జెప్పినన్ దొలఁగు మద్దోషంబు నిశ్శేషమై. 63

వ. ఆకర్ణింపుము. 64

సీ. వెలయు నేవీడు నిర్మలధర్మమహిమచే
ధాత్రి సత్యవ్రతక్షేత్ర మనఁగఁ
బ్రవహించె నెందు వేదవతి పేరిట
బ్రహ్మదేవునింతి సరస్వతీస్రవంతి
కావించె నెచట నిష్కామధీమహితుఁడై
హరిగుఱించి విరించి యధ్వరంబుఁ
జవి చూచె నెచ్చోట నవనాగ్నిహుతసహా
హుతిహవిస్సార మబ్జోదరుండు
కటకమాత్రంబె యది విశంకటజలగ్ర
హాగ్రహణవిగ్రహాయత్తహస్తి వరద
చిరదయాపాలమోక్షలక్ష్మీవిశాల
కటితటీసూత్నకళ్యాణకాంచి కాంచి 65

వ. అందు. 66

సీ. కలహంస కర్పూరకలిక పద్మావతి
మందారవల్లరి మధురవాణి
సౌందర్యలహరి పుష్పసుగంధి చిత్రాంగి
కాంచనమాలిక కనకరేఖ

రాజమోహిని కుమారసరస్వతి సుశీల
మదనాభిరామ మన్మథకఠారి
మంజుభాషిణి భానుమతి రమాతిలకంబు
కామమంజరి చంద్రికళ యనంగ
భూమిసలిలాగ్ని పవనార్కసోమకామ
విధిసుధారసమునితటిద్విబుధమర్త్య
జనిత మగుసచ్చరకులంబునను జనించి
వారసతు లుండ్రి సారశృంగారవతులు. 67

గీ. అందు నొకవారసతిపుత్త్రి నై జనించి
వృద్ధిఁ బొందితి దేవదేవి యనుపేర
నభ్యసించితి బాల్యంబునందు నృత్య
వాద్యసంగీతసాహిత్యవిద్య లెల్ల. 8

మ. ఎలమిన్ శైశవయౌవనాంతరవయోహేలావిలాసంబు నై
నలమన్ గన్గొని జ్యోశ్యు లిచ్చినశుభోదంచన్ముహూర్తంబునన్
జెలిమిన్ భూసురవృద్ధబాంధవజనాశీర్వాదపూర్వంబుగాఁ
దలిమం బెక్కఁగఁ జేసెఁ దల్లి నను నుద్యన్మోదవాత్సల్లియై. 69

క. క్రొన్ననవిల్తుఁడు నాకను
నన్నల వర్తిల్లు సురతసామ్రాజ్యగతిన్
కన్నెఱికంబుల వలపుల
మన్నెఱికం బెఱిఁగి విటుల మహిఁ బరిగొంటిన్. 70

ఉ. పంకజనాభు హస్తిగిరిభర్త భజింపఁగ వచ్చి నాకు నా
తేంకణకొంకణద్రవిళదేశ నృపాలకు లంటుకాండ్రు లై
కంకణముద్రికాళి కయి కానుక లిచ్చి వసింతు రింట నా
యంకణభూమిఁ బల్లకులు నందలముల్ పడిగాపు లుండఁగన్. 71

ఉ. కిట్టిన నోఁడొకళ్ళు తమకే తమకే పిలుపుంచుఁ జైపయిన్
గొట్టెలు పాడిపైరములు కోకలు రూకలు ముందుముందుగా

వట్టుగ నిచ్చి వచ్చి తలవాకిలిఁ గాతురు రేతిరిం బగల్
గుట్టినయస్సుమల్లరపుఁగోఁడెలు సైరిక రాట్కుమారకుల్. 72

గీ. వైష్ణవోత్తమ మీవంటివారి యెదుట
నాత్మసంస్తుతి నీతిగా దైన వినుము
నాఁటిదినములయందు మ స్మందిరమున
సంతతంబును గనకవర్షంబు గురియు. 73

గీ. అట్టిగడన విడిచి యవసి భిక్షావృత్తి
నేల తిరిగి దంటి వేని వినుము
నలువసృష్టిఁ గలుగుకులములలో నెల్లఁ
గాకులంబు లంజకాకులంబు. 74

సీ. అర్థప్రమోషణాయత్తంబు చిత్తంబు
బహువృషాభావనాభ్యసన రసన
యాజన్మపన్యతోహారములు కరములు
ప్రచురహేయాశనభక్షి కుక్షి
సంతతాన్యాయప్రచార మాచారంబు
మలికంబుమాయలమనువు తనువు
సకలవర్ణోచ్ఛిష్టసదనంబు వదనంబు
వితతకుతర్కాభివృద్ధి బుద్ధి
యంగజవ్యాధిఁ గడుపుబ్బినట్టివిటుల
యాత్మజలపూరములు తెట్టు వల్లపట్టు
హేయభాజన మెన్నిటు నెన్ని చూడ
వేశ్యజన్మంబు జన్మమే విప్రవర్య! 75

చ. ఎటు గణుతింప యోజనము లేఁబదికోటులు భూమి దీనిలో
నటు తుహినాచలేంద్రమున కవ్వలి వన్నియు దేవభూములే
యిటు హిమసేతుమధ్యమున నెంచాలఁ దాఁ బరికించి చూచినన్
విటులకు సత్యశౌచములు వేశ్యకు నీమము లే దొకింతయున్. 76

ఉ. ఒక్కనిఁ బిల్వ నంపి మఱియొక్కనిచేతఁ బసిండి పట్టి వే
ఱొక్కనియింటి కేఁగుచు మఱొక్కని నానడుచక్కి నొక్కచోఁ
బొక్కిలి దాఁచికూడ భ్రమఁ బొందిర విటుల్ దెలియంగ లేరు గా
కెక్కడిసత్య మెడపల పెక్కడినేమము వారకాంతకున్. 77

గీ. మమత మూఢవిటులు మాన రింతియె కాక
వెలపొలంతి కెందు వలపు గలదె
సజ్జ గలిగె నేని త జ్జాతివలపును
జాతివలపు నొక్కరీతి దలఁప. 78

ఉ. మేఁతలు మాంసముం జమురు మెత్తనియన్నము గట్టిపెర్వమన్
బూఁతలు గంధముల్ కపురమున్ మృగనాభియుఁ గాక వేశ్యకున్
మేఁతలు పూఁత లన్నవి గణింపఁగ మందు లె తారు మందులై
చేఁతలు కుంచిమారములు సేయుదు రింతియ కాక దుర్విటుల్. 79

క. సద్యోవశీకరణజన
హృద్యకుభోకారవిభవ మెన్నఁగ నేలా ?
పద్యమ్ముఁ డైనవాఁడే
పద్యమ్ముఁడు జగతి వారభామల కెందున్. 80

చ. తలనిలువర్థ మిచ్చినను దాము కులస్థులు కాని హీనులకే
బిలువ మటన్న నేమములు భేషజముల్ వెలయాండ్రు పిల్తు రే
కులజుల నైన మున్ను తమకుం బ్రకృతంబుగ నిచ్చినట్టికో
వెల కధికంబు నొక్కయరవీసము తాసును జేతి కిచ్చినన్. 81

క. ఆపల్కు లాలకించినఁ
దీ పొల్కుచుఁ గురియుఁ గమ్మదేపియసోనల్
లోపలఁ బరికించిన నీ
లోపలసదృశములు వారయోషాతతికిన్. 82

గీ. అవల రో పట్టి యొంత రే యైన సిద్ధి
గూఁతుఁ బోనీదు పోకారు గోఱుకుకొఱకు

నాఁ డవశ్యంబుఁ బిలిపించు నను పువిటులఁ
దల్లి యల్లుండ్రిపెదబూచి ధనపిశాచి. 83

సీ. మునుపు జంగాలఁ జేసినభుజంగులఁ గన్న
గర్జించి శునకమై కఱువ వచ్చుఁ
బెట్టూకించుకతీసికట్టైన బెట్టుచే
దట్టించు విటుని గంధర్వు నైనఁ
బానదక్షిణ పుట్టె నేని దజ్జామాతఁ
బ్రేమతించు విటశిఖామణి యటంచు
ధనవంతుఁ డైన మెత్తని వాఁడు చేరు నా
పుత్రిక కొప్పించుఁ బోటివిటులఁ
బయిసమాలించుఁ దనపిన్నవయసునాఁటి
పడుపుసుద్దులు దలపెట్టి పాఁతజోలి
నోరు విడివడ్డఁ బచ్చిబూతే రచించు
వివిధమాయామయోపేత వేశ్యమాత. 84

శా. ఏవేళ న్మఱి యేముహూర్తమున మా యిల్ చొచ్చినాఁడో మనో
భావజ్ఞుం డయి సర్వము న్నడుపు నాబంగారుకొళ్ళయ్య జే
జే వెయ్యేఁడులు రాజ్యమేలు మనుచున్ జేమోడ్పు నీరీతి మా
యావాదంబులచే ధనం బొలుచు వేశ్యామాత జామాతలన్. 85

ఉ. ఈ విట రమ్ము హాస్యమట యే గుఱు తింతియు కాక మాకు నీ
యీవు లిదేమి గుఱ్ఱు విడెమే పదిలచ్చలు వద్దటంటిమా
దేవర చిత్తవృత్తి యొకతీరయి యుండు నిదే సుటంచు మి
థ్యావినయోక్తుల న్విటులఁ యర్థము లొల్తురు వారకామిల్. 86

గీ. అనఘ వేశ్యావిడంబవర్తనము లెన్న
నిసుకపాతఱ యీపోలి యేల త్రివ్వ
నప్పుడు పుఁగూటపై నసహ్యత జనించి
నామనసు రోసినట్టిచందంబు వినుము. 87

క. ఆరోహిణి నవరోహిణి
నేరతి రస డుల్లి విలువ హెచ్చులుగా బం
గారములునుఁ దారములు న
పారములుగ నే గడించు పర్యాయమునన్. 88

మ. ఒకయేకాదశి నాఁటిరేయి నను లై యున్నట్టిరో వెట్టువే
డుకకాం డ్జివ్వరు రామిఁ బల్లవుఁ డొకండున్ లేక లోఁ గాఁగి శ
య్యకడ న్నిల్వ సహింప కి ల్వెడలి యాతాయాతరీతి న్మనో
వికలత్వంబున వాడవాడల విటాన్వేషంబుఁ గావించుచున్. 89

ఉ. ఆనిసి వేళ విష్ణుభవనాంగణమంటప వేదిక న్సుఖా
సీనత నుండి జాగరము సేయుచు నేజను లర్థదీప్తిగా
భూనుతలీల భాగవతముం బఠియింపఁగ నంతఁ బింగళా
ఖ్యానము వింటి సంటినయఘావలి యావలి కేగ వీయఁగా. 00

క. అది విని వేశ్యాభవ మి
ట్టిదె కా యని విరతి పుట్టె డెందంబున బె
ట్టిద మగునర్థార్జన క
ష్టమురాశాపాశములు దటాలున నూడెన్. 90

క. ఆ వేశ్య నాకు గురువుగ
నే వేశ్యాత్వంబు మాని యేకాకిని నై
శ్రీవేంకటపురుషోత్తమ
దేవాయతనాది దివ్యదేశములందున్. 91

సీ. పరిత్యక్తజనకధర్మస్థాపకత్వమె
సతతంబు నిజకులాచారముగను
పద్మనాభద్వయోపరిదివ్యనామమే
యనిశంబు జిహ్వా కభ్యాసముగను
జలరుహాంబకచిహ్నములె సంతతంబును
బాహుమూలముల కాభరణములుగ

భగవద్విలాసవైభవమె యశ్రాంతంబు
. నంతరంగంబున కాస్థ గాఁగ
నవిరళభుజంగశయనసేవానురక్తి
చిత్తమున హాటకాంబరచింతనంబె
కాని తక్కినవాని డగ్గఱఁగఁ బోక
భాగవతముద్రి నొంటి నిప్పాట నుండి. 93

మ. అకలంకస్థితి నాఁటనుండియును శూద్రాన్నంబు వర్జించి మా
ధుకరవృత్తిక్రియ బ్రాహ్మణాన్నమె భుజింతున్ లేనిచో సజ్జన
ప్రకరాగారములందుఁ జేయుదు స్వయంపాకంబు శ్రీరంగశా
యికృప న్వ్యర్థదినంబు లీకరణి స్వామీ నేఁటిపర్యంతమున్. 94

గీ. వారసతు లైన యీసీమవారివలెనె
మోడిమానిసి నైన నే గోడు లేదు
జిహ్వ వాల్గచ్చు గాలు నేర్చినకతాన
పడుపుఁగూఁ కి మనసు గొల్పక యిట్లుతి. 95

క. అని వనిత యిబ్విధంబునఁ
దనకులశీలములఁ జెప్ప దానిని వేశ్యాం
గనగా నెఱిఁగి మనంబున
ననుమానము వొడమ వైష్ణవాగ్రణి యనిమెన్. 96

క. ఇమ్మల వేశ్యాసహవా
సమ్ములు శ్రీవైష్ణవులకుఁ జందం బగునే
మ మ్మావల నే మందురొ
కొమ్మా యీలోకు లెంచుకొమ్మా దీనిన్. 97

ఉ. కాకులు రాఁపఁడ్లు దినఁ జేర శిలామయదేవమందిరా
నీకములందు రావులు జనించును సజ్జనచిత్తవృత్తి య
వ్యాకులలీల నాటిగుడివంటిది లోకములోన వేశ్యలుం
గాకులవంటివార లటుగానఁ బ్రమాదము చేర నిచ్చినన్. 98

వ. అనిన నవ్వేదవేదికి దేవదేవి యిట్లనియె 99

ఉ. ఎందఱికైనఁ గొంకు పఱచెందఱికైనను కానఁ జిప్పిమై
నొందఱు గోతసేఁత లపు డేఁతిఁ జేసిన నిచ్చగించు మఱ్ఱ
డొందము తాయిగాఁ గొని గడించినకష్టపుసంజెకూడు నా
కిందక రోసి వచ్చితి సహించుము నీకిఁకనకూడుఁ గ్రిమ్మఱిఁ. 100

క. భోగేచ్ఛ నాకుఁ గల్గిన
నీగతిఁ జరియింప నేఁకిఁకింటనె యున్న
న్నాగదె మున్నిటివిటసం
భోగము గంతలకుఁ దగినబొంతలు లేవే. 101

క. నామనసు చూచి విఱిగిన
దీమొయి నీమనసు చూడకే విఱిగిన దిం
దేమిటికి శంక పడ ధా
త్రీమండలిఁ బాలు విఱిగి తిరుగ నతుకునే. 102

క. వినవే సామెత మును తన
మనసు పదిల మైన లంజె సుందిరమున నై
నను గాఁపుర ముండఁగ నగు
ననఁగను వి ట్లాడ నీకు నగునె మహాత్మా. 103

వ. అని యిట్లొప్పవడం జెప్పిన నప్పలుకులు విని యతండు తన మనంబున.

గీ. రూపమునఁ గుంటి గాదు కురూపి గాదు
వారసతి యై గడించు నీవయసువంకు
దేశమున భిక్షమెత్తుకో దీని కేల
మనసు గట్టివిరక్తిఁ బొందినది గాక. 105

—విప్రనారాయణుఁడు దేవదేవి దాస్యా బంగీకరించుట—

గీ. దాస్యవృత్తికి నిటువంటిదానిఁ జేర్చు
కొనఁ గొదువ లేదు వలదు పొమ్మనఁగ నే

యిది యదృచ్ఛానులాభ మైె యొదవెఁ దోఁట
పనికిఁ జేదోడు వాదోడు పాటు పడును. 106

క. బరప సముత్సోడఁ బసికో
క్కరుఁడను బారలంగ నీవె గలిగి సహాయం
బిరువురము నైన రంగే
శ్వరు కైంకర్యంబు నిర్విచారత సాగున్. 107

వ. అని తలంచి యమ్మోహనాంగి యతని కిట్లనియె 108

గీ. నెలఁత సుకుమార మైనది నీదు మేను
తోఁటపని సేయు నెడఁ బ్రిసాపాటు మాధు
కరము మాకొసఁగిలంకె నీకరణి నుండ
నోపుదే యన్న నతని కయ్యువిద యనియె. 109

గీ. అనఘ జాత్యభిమాన దేహాభిమాన
లేశములు దాసురాలికి లేవు మాధు
కరము నలవాటె మీవంటిఘనులు దిద్దు
పనులు సేయుటకంటె శుభంబు గలదె. 110

సీ. మాఱి నెక్కనేరను గాని పువ్వులు గోయ
దండలు గట్ట వింతలుగ నేర్తు
సేత మెత్తఁగ నేర నింతియు కాని
నే గట్టిగా నీ ర్మళ్ళఁ గట్ట నేర్తు
ధరణి గుద్దలి పట్టి త్రివ్వ నొక్కటి నేరఁ
గానినే మళ్ళచ్చుఁ గట్ట నేర్తుఁ
బరవసంబునఁ జేనిపసి నేరఁ గానినే
నింటిలో పలిపను లెల్ల నేర్తు
బుద్ధి మతిఁ జెప్పి స్వాములు దిద్దుకొసిన
సేవనికి నైన దాసురా లోపఁగలను

అర్థి మాఱటరంగేశుఁ డైననిన్నుఁ
గూర్చి వచ్చితిఁ గరుణ నీడేర్చు నన్ను. 111

సీ. నిర్వాణరాజధానికి నేగుదారికిఁ
జక్కనిత్రోవ యాచార్యసేవ
విరజానదీసముత్తరణంబునకు
మనోజవ మైననావ యాచార్యసేవ
త్రిజగజ్జనులకు సతీపతిన్యాయ మై
చాగినపావ యాచార్యసేవ
అజ్ఞానహతుల విజ్ఞానవంతులఁ జేయు
సంజీవితీవ యాచార్యసేవ
యాశ్రయించినవారల కర్థి నిచ్చు
విష్ణుసాలోక్యసారూప్యవివిధదివ్య
భోగసామ్రాజ్యవైభవాభోగమహిమ
శాశ్వతం బైనఠేవ యాచార్యసేవ. 112

గీ. అనిశ మాచార్యసేవ గల్గినజనులకు
దేవభూదేవతీర్థసంసేవ లేల
అనిశ మాచార్యసేవ గల్గనిజనులకు
దేవభూదేవతీర్థసంసేవ లేల. 113

గీ. అనుచు శ్రీవైష్ణవకథారహస్యధర్మ
మార్య లెన్నుటఁ జేసి యాచార్యబుద్ధి
మిమ్ము సేవింప వచ్చితి నెమ్మి వెరవుఁ
గఱపి పనిఁగొను మెద నఱమఱలు లేక. 114

క. తిరుకట్టుసేవఁ జేసెదఁ
దిరుమాలిహ సలికి పూసి తీర్చెద ముగ్గుల్
తిరుమజ్జనంబుఁ దీర్చెదఁ
దిరుపుట్టము లుతికి వేగఁ దెచ్చెద దినమున్. 115

క. అన విని యతఁ డవ్వనితఁ
గని యప్పలుకులకు నలరి కామిని రంగే
శునికైంకర్యము చేకొని
మన మిరవుగఁ జేయుదము సమంచితభక్తిన్. 116

గీ. అని తదీయదాస్య మంగీకరించె న
ద్దాసరయ్య యచట నాసరోజ
లోచనయును మాఱిలోఁ జేవ చొచ్చినఁ
గతిఁ బ్రవేశ మంది ప్రతిదినంబు 117

వ. ఇట్లుపచరించుచు నతనికి నయ్యతివ యిట్లనియె. 118

క. ధరలో మాఱటరంగే
శ్వరుఁడవు దాసులకు నీవ సంతతమున్ దే
వరకైంకర్యము మన్మథ
గురుకైంకర్యంబు దీనఁ గొదవయె నాకుఁ. 119

సీ. అరుణోదయంబున కటమున్న మేల్కాంచి
నది కేగి యాచమనంబుఁ దీర్చి
మజ్జనం బాడి నామముఁ బాదుకొనియాత్మ
వస్త్రంబు నతనిదోవతియు నుతికి
తిరుమజ్జనముఁ జేసి తిరుమాల్గఁ గన పూడ్చి
యలికి ముగ్గులు వెట్టి యతఁడు మేలు
కని వచ్చునపుడు గన్గొని వందన మొనర్చి
యాచరణీయకృత్యంబు లడిగి
యతఁ డనుష్ఠాన మొనరించి యరుగుదెంచు
వేళ కారామవాటిఁ గొ్ర్విరులు గోసి
సరులు దండలు గావించి సజ్జ సించి
యతనిముందఱ నుంచు ని ట్లగునె యంచు. 120

గీ. మొలపుత్రోఁ జెట్లపాదులఁ గలుపు దీయు
నెమ్మి దోహదధూపధూమమ్ము లిడును
సందెపొద్దైనఁ గస వూడ్చు మందిరమునఁ
దిరువళకు వెట్టు నెరపు రాతిరులు దాఁచు. 121

గీ. ధాన్యముష్టి గులా మెత్తి దాన నిత్య
మేకతంబునఁ దా స్వయంపాక మాచ
రించి సాపాటు సేయుదునంచు నతని
మొఱఁగి తనయింటి కేగి ముమ్మాఱు భుజించు. 122

గీ. చెఱఁగు మాసినపుడు మఱుఁగున మూనాళ్ళు
యొదిగి యుండి నాలవదివసమున
నెరులు పోయుతీర్థ మొగి నాడి పిదపఁ దాఁ
దీర్థమాడుఁ బుణ్యతీర్థములను. 123

వ అంత 124

గీ. తోయజానన యన్న పానీయములకు
నాసపడ కిట్లు వెలలేనిదాసి యగుచు
నెనసి పనులెల్లఁ జేయఁ గన్గొని కృపాప
రాయణుం డైనవిప్రనారాయణుండు. 125

సీ. ఏఁ బ్రిసాపడి తోఁట కేతెంచునందాకఁ
బని సేయుఁ దాఁ బ్రిసాపడను బోదు
నేఁ జేతఁ బని వట్టి తేఁ జూచి ముందుగాఁ
దా నందుకొను నోడల్ దాఁచుకొనదు
నే మేల్కనకమున్న దా మేలుకొని
దేహశుద్ధి యై తిరుమార్గశుద్ధి చేయు
నేనిద్రఁ బోవుదాఁక నిద్రఁ బోవ దే
పనిఁ జెప్పునో యని పాయ కుండు

విరతిమై నింట వేఁపుర విడిచివచ్చి
తోఁటపనిపాటు కోడిగి నాతోఁ బ్రయాస
పడుచున్నది పరదేశిపడుచు దీని
సాఁకకున్న నుపేక్షోపచార మొదవు. 126

వ. అని తలంచి యద్దేవదేవిం గనుంగొని. 127

చ. లలనరో యెందు నీ విఁక గులామునకున్ జన వద్దు మాకు ని
చ్చలు పెరుమాళ్లకోవిలఁ బ్రసాదముకట్టడి సాగి వచ్చు నా
తలియప్రసాద మీవు సతతంబుఁ బ్రసాదము మన్న మ్రొక్కి య
మ్మెలఁతుక స్వామిచిత్త మని మేకొనియెన్ ముదితాంతరంగ యై.

వ. అంత నవ్విప్రనారాయణుఁడు. 129

గీ. తనకుఁ గోవెలపడిప్రసాదము నిరంత
రంబుగా సాఁగివచ్చు శ్రీరంగవిభుని
పళ్లెరంబుప్రసాదంబు ప్రతిదినంబు
ప్రొద్దుప్రొద్దున రేపుమాపులును దెచ్చి. 130

క. కూరలు నన్నముఁ దిరుప
ణ్యారముఁ బచ్చళ్లుఁ దిరుకణామధుమధురా
హారములు నవ్వధూటికి
సొరుచి ముప్పూటలును బ్రసాదఁ బెట్టున్. 131

గీ. తాను మాధుకరము మానక యెప్పటి
యట్ల వైష్ణవాలయముల కరిగి
రంగవసతిఁ దిరువరంగంబె గోవెల
యనుచు భిక్ష మెత్తుకొని భుజించు. 132

ఉ. ముద్దియయున్ సదా యతనిమ్రోలఁ బిచెండికడన్ గెలంకులన్
బ్రొద్దొకచాయ వర్తిలుచుఁ బూవిలుకానిప్రయోగభూతయై
యెద్దెసయుం బ్రవేశమున కించుకయేనియు సందు లేమిఁ బ
ల్లొద్దిక రంధ్ర మారయుచు నుండెఁ దదేకపరాయణస్థితిన్. 133

సీ. మూఁపుపైఁ గురులు క్రొమ్ముడి సేయ నొకవేళ
నొకవేళఁ జెంగావి ప్రోవఁగడిద్దు
వెలినాభి దోఁప నీవిసడల్చు నొకవేళ
నొకవేళఁ గంచుకం బూన్చితొడుగుఁ
దొకతొక నాడుముద్దుంచూట నొకవేళ
నొకవేళఁ బాల్గోర్కు లొనర నెరపు
వలిపెంబుఁ గట్టుఁ బావడ లేక యొకవేళ
నొకవేళఁ బయ్యెద నోరచేయుఁ
గదిసి వీనుల సొక్కఁజొక్కముగఁ బల్కు
నొయ్యనొయ్యన సంగీత మొక్కవేళ
సకియ యస్ఖలితబ్రహ్మచారి యైన
వైష్ణవోత్తముమోహ్రిల లావణ్యలీల. 134

వ. ఇవ్విధంబున. 135

క. వటుమానసను క్షేత్రముఁ
గుటిలాలక చేష్టితముల గుద్దలిఁ గొని యి
ట్టటు పాదుచేసి మోహపు
వటబీజము మరుఁడు నాటి వర్ధిలఁజేసెన్. 136

క. ఐహికసౌఖ్యంబులు ని
ర్మోహుం డగువటుని కత్తునిసద్దాస్య
స్నేహం బతిపరిచయమున
మోహం బై బుద్ధిచలనము జేయుటయుక్. 137

సీ. ఆకాంక్ష తెప్ప వేయఁగమాను ననిశంబుఁ
దలఁపుచేత ని తృప్తిఁ గొలుపు మదికి
వనజాక్షికొంగు సోఁకిన మేను గరుదాల్చు
మొగము విప్పగఁ జేయు మగువ నగిన
నర్థి నొయ్యనఁ గోర్కి నడుగ నుద్యోగించు
నడుగఁ జాలమి నేటి కనుచు మానుఁ

జెలిపల్కు మెచ్చి కోయిలపల్కు దూషించి
నధరంబుమధువున కాసఁజెందు
శిరసుపైఁ బేనుఁ బొడగన్నఁ జేరఁబోయి
హింస సేయకు మని చేతి కిచ్చుఁ దిగిచి
తన్మయత నొంది కలికిచేఁతలనె హరిప
రాయణుం డైనవిప్రనారాయణుండు. 138

శా. ఆవిప్రోత్తము వజ్రపంజరనిభంబై నిశ్చలంబై నన
ద్భావం బంగనసాహచర్యగుణసంపర్కంబునన్ లోహమై
గ్రావం బై దృఢదారు వై తరుణవృత్తం బై ఫలప్రాయమై
పూవై తన్మకరంద మై కరఁగెఁ బో నీళ్ళకుం బల్చనై. 139

గీ. గారఁ ద్రావిసమానుసంగతి మనోజ
వేదన నతండు పొరలఁ దన్వియు నెఱింగి
తనవలకుఁ జేరెఁ బో బోడిదాస రనుచు
డెందమునఁ జాల సంతస మందె నంత. 140

— ♦ వర్షర్తువర్ణనము. ♦ —

గీ. రంగవిభునకు విప్రనారాయణుండు
చేయుతోమాలికలకుఁ జాంపేయకములు
వేసవి యొసంగె నని మొగిల్వారు లొసంగ
మఱి దలంచెను దరువాతిఋతు వనంగ. 141

సీ. చాతకవ్రజపిపాసావ్రతోద్యాపనా
కార్యనిర్వాహకాచార్యవరుఁడు
భూపుంస్త్రిగ్రీష్మతాపజ్వరప్రశా
శనరసౌషధచికిత్సావరుండు
మహనీయభూమిభృద్గుహావిహారిమయూర
సందోహనటనశిక్షాగురుండు
శతపత్రమిత్రప్రహృతజగజ్జీవన
ప్రత్యర్పణక్రియాప్రథితదాత

మొనసి నీరంధ్రబంధు రామోఘమేఘ
జాతసంజాతవృష్టిసంఘాతవాఃప్ర
భూతభూతలశీతలవాతధూత
వాప్తహర్షాగమంబు వర్షాగమంబు. 142

గీ. ఆన మాయుష్మ లీక ఘోతేం యతను
ధరణిపంపున దోలు కారుతరువు కాంచు
నింగి గుడి వ్రాసి యూంగిసభంగి నపుడు
చండకరుఁ డుండెఁ బరివేషమండలమున. 143

వ. అంత. 144

శా. పార్థఖ్యాతిలదిక్తటిత్పటుశటప్రద్యోతవిద్యోతితా
వ్యర్థోగ్రాశనిపాతజాతఘనగర్జాడంబరవ్యాప్తి న
త్యర్థంబుగ ధరణీజనంబు చకితం బై యర్జునః ఫల్గునః
పార్థః కృష్ణ యనన్ ధరిత్రిఁ దొరఁగెన్ ప్రత్యగ్రవార్బిందువుల్. 145

క. కటపెట తొటతొట రాలెడు
పొటపొటచినుకుల ధరిత్రిపొడ నట్టువడన్
సొటసొట నాఁకట సోలుచుఁ
దటతట పసుచాతకములదైన్యము వాసెన్. 146

శా. అంభోదప్రకరంబు లత్తఱి సముద్యద్దీర్ఘనిర్ఘోషసం
రంభాఘాతవిభగ్నదిగ్గజకఠోరగ్రావఖండావళీ
దంభాంభశ్చరవాహిసీకలుష పాథస్సంభదంభోఘ లై
సుంభద్రోణము గాఁగ వాన గురిసెన్ ఘోరాంబుధారాకృతిన్.

క. ఘోరము లగున వ్వర్షా
వారములం దొక్కనాఁ డవారితధారా
సారంబు పయోధరముల్
ఘోరంబుగఁ గురిసె ముసురుకొని నిశిదాకన్. 148

క. ఆసరి వేళఁ దనచవిక
లోని చిలుకలయరుఁగుపై విలోలత వటుఁడుక్
వాస పయిఁ జిలుక వాకిటి
తీనియపైఁ జేరి దేవదేవియు నుండెన్. 149

శా. యాదోరాశిపశేషణోదితదృగంతారుణ్యావ
ద్వైదేహావరణానుప్రక్షుణ్ణధనుర్వ్యాదిత్రివాదిత్రియా
శైదంపత్యవిధానదా నగరిమా సర్వజ్ఞపాద్యానతా
ర్త్యాదిత్వర్థగతాసురేశ్వరనివాసా౽కుసారకుమా ! 150

క. అలఘూకృతగుహాభక్త్య
త్కలితాంగహృదంగ మలతరణివిధానా
ఫలమః ఖకలితసుముక్తా
ఫలదంబునిదాన దీనభక్తాఘేనా ! 151

మాలినీవృత్తము. అనుజభృతశరాసా యాశ్రిదాపన్నిరాసా
మనుజకనకవాసా మంజుసాకేతవాసా
అనుస్మృతనిజదాసా యర్హకార్యానువాసా
అనుపమదరహాసా ♦ యాతుభిశ్ఛంద్రిహాసా. 152

—♦ X ద్య ∘ ♦—

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్ర పవిత్ర శ్రీరామచంద్ర
కరుణాకరాగతవైభవ సారంగునృసింహామాత్రిపుంగవతనూభవ
పరిచితభగవద్భాగవతకైంకర్యవిధాన తమ్మయాభిధాన
ప్రణీతం బైన వైజయంతీవిలాసం బనుమహాప్ర
బంధంబునందుఁ ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# వైజయంతీ విలాసము

అను

# విప్రనారాయణ చరిత్రము.



## తృతీయాశ్వాసము.







క. శ్రీజానకీవిలాసా
తేజక సల్లాప వసుమతీద్యోపేటీ
రాజితలేపా యార్జిత
రాజశతయశఃకలాప రఘుకులదీపా. 1

వ. అవధరింపు మట్లు నిరర్గళధారావర్షంబు గురియుచుండఁ దీనియపై
దేవదేవి యుండుట యెఱింగి యప్పుడవ్విప్రనారాయణుండు. 2

ఉ. వారిజపత్రనేత్రి నిటు వానదెసంబున నింటిలోనికిం
జేరఁగఁ బిల్చి నాతలఁపుఁ జెప్పినఁ జేకొనకుండిన న్బలా
త్కారము దోష మంచుఁ బలుకం బరభామిని గాను చొతకుం
జేరినమీఁదఁ గుక్కుటము సేయునుపాయముఁ జేయుటొప్పగున్, 3

క. అని తా నయ్యువతిం గని
వనితా చలి నుండ నేల వాకిటికడ వె
చ్చనితావున కిటు రమ్మనఁ
జని తా నాలోనిగడపచక్కినె యున్నన్. 4

క. అయ్యెడ మిక్కిలి శైత్యం
బియ్యెడ కేతెమ్ము వేగ యింతి నివాతం
బయ్యున్నది యిచ్చో ననఁ
దొయ్యలి యాబ్రహ్మచారితో నిట్లనియెన్. 5

ఉ. ఆరయఁ బెక్కువాసరము లాయెను నే నిటవచ్చి యెన్నఁడుం
జేరఁగ రమ్మి నీ వని స్పృశించుట లే దిది యేమి నాపయిం
గూరిమి నేఁడు మీ సరసకుం జనుదెమ్మని యానతిమ్ము టో
సూరివరేణ్య నన్నొరసి చూచుటకో మతి నిక్కమో యనన్. 6

—♦ విప్రనారాయణుఁడు దేవదేవితోఁ దనమనోరథము దెలుపుట ♦—

ఆ. నిన్ను నొరసి చూడ నున్నదే పదియాఱు
వన్నెపసిఁడి కొదవ లెన్నఁ గలదె
మాయభీష్టమైనమాట చెల్లకువచ్చి
ముంత దాఁచ నేల యింతి వినుము. 7

క. సరసిజముఖి పంచాయుధ
గురుకైంకర్యంబు మనసు గురువై చెప్పన్
సరి నింకొకపంచాయుధ
గురుకైంకర్యమున నీవు గురు వగు మనుమున్. 8

ఉ. ఆసరసీరుహాక్షి నతఁ డమ్మెయి నాడిన మన్మథార్త వా
చాసరణిం గను న్నిజవశంవదుఁ డౌట యెఱింగి చిక్కరా
దా సరితోడ యిప్పుడు సదా తలయెత్తి మెలంగఁ గల్గుటల్
నా సరివారిలో నని మనంబు ఘనం బగు వేడ్క నుబ్బఁగన్. 9

చ. ఎనసి మనంబునందు నతికిం బతికి న్వల పంకురించినన్
గొనకొని ధాత్రి నేనుఁగులకొమ్ములు వచ్చినయట్టు లింక ని
ప్పనికిఁ బ్రసూనసాయకుఁడె పైతరువే మన నీక పీనిఁ జెం
దినవలరాచవాజ్ఞ తరితీపులచేఁ దల కెక్కఁ జేసెదన్. 10

వ. అని యూహించి యతని కిట్లనియె. 11

గీ. అనఘ మీతిరువడిఘు లే నాశ్రయించి
నపుడె మద్దేహజీవధనాదికములు
తావకాధీనములు గావె దాని కేమి
విన నవధరింపు మీదాసివిన్నపంబు. 12

శా. క్షేత్రజ్ఞప్రకృతిస్వరూపవిదు లక్షీణాఘాగ్రిజిహ్వాతను
శ్రోత్రోద్భూతసుఖవ్యపేతు లురువిష్ణుధ్యానపారాయణుల్
మిత్రామిత్రసము ల్భవాదృశులు స్వామిప్రకృతు లెవ్వాలెని
మూర్తిద్వారము పేరిఘోరనరకంబుం జేరఁ గాంక్షింతురే? 13

క. పరకాంత దోష మటువైఁ
బఱికించిన శూద్రజాతిఁ బడపుసతి న్దే
వరదాసి నీవు మోఁజీ
ధరుఁడవు వైష్ణవుఁడ వంటఁ దగునె మహాత్మా. 14

ఉ. విప్రకులావతంస పృథివీస్థలి నిట్లపవిత్రురాల వి
ష్ణుప్రతిమాను నేక్రియ నినున్ స్పృశియింపఁగ నేర్తు నాపుకున్
విప్రులఁ బొందిరేని యపవిత్రులు పూజ్యులటన్న భారతీ
యప్రథితోక్తి గాదె వనితా పరిహారము నీకు శంకకున్. 15

శా. దాసీసంగతుఁడైన వ్యాసు గురుకాంతాగామి శీతాంశు వే
శ్యాసాఖ్యాత్ప్రితుఁ డైన కౌశికుని శూద్రాపత్యసన్వ్యారతి
వ్యాసక్తుం డగుఁ బరాశరు నేవారైన వెల్వెట్టిరే
నీసంగంబున వారికైనగతి తక్కే నాకుఁ గాని న్నిఁకన్. 16

వ. అనినఁ గ్రిమ్మలి నమ్మగువ యిట్లనియె. 17

ఆ. నిడుదపట్టెతిరుమణియ వైష్ణవమః కాని
మీఁర లాడుమాటతీరు చూడ
నసపు నొసలు జుత్తుఁడును నోరు త్రోడే ల
టన్నరీతి తోఁచు చున్న దిపుడు. 18

చ. పడుపునకే సృజించె మును పణ్యవధూటుల బ్రహ్మ యట్టివం
గడమునఁ బుట్టి యున్నకడ గాదప రోసితి నేను నీవయో -
పడుగవు బ్రహ్మనిష్ఠుఁడవు వైష్ణవధర్మవిదుండ వాపనుల్
నుడుగ జుగుప్స పుట్టకిటు నోరెటు లాడెఁ దలంపుమా మదిన్. 19

గీ. తోన యారూఢపాతిత్యదోష మింను
సంభవించు భవద్బ్రహ్మచర్యమునకు
వైష్ణవోత్తమ నా కిందువలనఁ జిక్కు-
మొదలిపాటుకు వచ్చినఁ గొదవ లేదు. 20

గీ. అనఘచారిత్రి శ్రీవైష్ణవాపచార
మెట్లు సేయుదు మిమ్మంటి దే నటన్న
భావభవపుష్పభల్లధారాభిభిన్న
హృదయుఁడై తొయ్యలికి నతఁ డిట్టు లనియె. 21

క. అపచారము గా దిది మా
కుపచారమె గాని యోతిలోదరి సమ్య
క్కృపచేఁ గైకొని శంబర
రిపుచేఁ జాకుండ నుద్ధరింపుము నన్నున్. 22

క. ఓసతి భగవత్సేవకు
వాసి గణింపంగ భాగవతసేవయ త
ద్దాసుల కైంకర్యముఁ గృప
జేసిన రంగేశ్వరునకుఁ జేయుట సుమ్మీ. 23

వ. అనిన నవ్వాటకు మందస్మితసుందరవదనారవిందయై యుంగువదన
దేవరచిత్తంబు కర్తవ్యం బెద్ది యనిన. 24

—♦ విప్రనారాయణుఁడు దేవదేవిం గూడుట ♦—

క. తిరువళకు మలపు మనన్పుడఁ
దిరువళకు మలంచినపుడె దేవరదాసిఁ
దిరుపడిహాళకైంకర్యముఁ
బరునిశిఁ గావించు టెట్లభాసము గాదే. 25

క. దీపము వస్త్రధరాగో
దీపము లక్ష్మీకరము మదికి భయహర మా

దీపము శేసరతు ల్సుఖ
లోపము లవి చీఁకటింటికిఁ వెకిరింతల్. 26

వ. మఱియును 27

క. ఆడెడుకొమ్మ పదంబులుఁ
గాడెడుకలకంఠిమోము భావజుకేళిం
గూడెడుసకియలచోటుల్
చూడకె రహిఁ బుట్ట దంఘ్రి సుగుణులమేదికిన్. 28

వ. అనిన నతం డిట్లనియె. 29

క. ఏపనులకు దీపము దగు
నీపనులకుఁ దగ దటన్న నింతి యిటు లనెన్
దీపంబు మలఁప వలదా
దీపము మానసంబు చీర తెర సారింతున్. 30

క. నావ్రుడు నది తెన్న యదే
కావింపు మన న్నిజాంశుకమ్ము విడిచి రా
జీవనయన దిగ్గన న
ద్దీపికకుం దనకు నడుమఁ దెర వైచుటయున్. 31

క. పలిపెంపుఁజీర తెరలో
పలిదీపచ్ఛాయ వారిపై నవ్వేళన్
బలపలనై రాఁ దెరకును
వెలుపలఁ బ్రసరించె లేఁతవెన్నెల పోలెన్. 32

క. తెలివ తెర వైచు నెపమున
నెఱిఁ గట్టినచలువ విడిచి నిలిచినఁ గడు న
త్తఱి మెఱసి నెరకుఁ బాసిన
కిరకంఠునరాతిచేతిఖడ్గముఁ బోలెన్. 33

వ. ఆసమయంబున. 34

* * * * *

* * * * *

ఉ. చూచినయంతలోఁ దనకుఁ జొప్పడు దాఁక నధిజ్యధన్వుఁడై
లాచినమన్మథుండు కరలాఘవ మొప్ప నిశాతపుష్పనా
రాచపరంపరల్ పఱపి వ్రయ్యలు చేసెఁ దదీయశీలముం
గాచినధైర్యవజ్రమయకంకటముం బటుశౌర్యధుర్యతన్. 36

వ. ఇట్లు విగతధైర్యుండై యవ్విప్రవర్యుం డయ్యతివ కిట్లనియె 37

గీ. కొమ్మ నీమోవియమృతంబుఁ గ్రోలకున్నఁ
బ్రాణములు నిల్వ వతనుతాపమున మేన
దయ నొసఁగు బ్రాహ్మణోనహంతవ్య యనిన
వాక్య మూహింపు నావుడు వనిత పలికె. 38

గీ. విటజనోచ్ఛిష్ట మైనట్టి వేశ్యమోవి
వేదపారాయణాతిపవిత్ర మైన
వైష్ణవాస్యంబు నెట్లంటవచ్చు ననిన
వలపు దొలఁకాడఁ బలికె నవ్వైష్ణవుండు. 39

క. ఆవులవెన్నయు ధాత్రీ
దేవులపాదములు యతులదృక్కులు కవివా
చావృత్తి వహ్ని వాజి
స్త్రీవదనంబులు కడున్ శుచిత్వపదంబుల్. 40

వ అదియునుం గాక. 41

క. మృగయావిహారవేళల
మృగదంశకవక్త్రములును మీనాంకాజిన్
మగువలఘనంబులున్ శుచు
లగు నుచ్ఛిష్టత్వ మంట దప్పనిపట్లన్. 42

క. అని ధర్మశాస్త్రసూక్తుల
మనుముఖ్యస్మృతులు తెలుపు మానిని యిఁక నీ
వనుమానము మాని వెసన్
నను మన్మథకేళి నేలు నావుడు వేడ్కన్. 43

క. నారీమణి యప్పటునిపు
నోరథమును గూడి నిజమనోరథ మొసరం
దారసిలి కౌఁగిలించెను
మారశిలీముఖభయంబు మదిఁ బోనతనిన్. 44

వ. అంత. 45

సీ. ఆత్మహస్తమునఁ బంచాయుధచిహ్నము
లాబాహుమూలంబులఁ బాదుకొల్పి
దల మైనచెమటబొట్టులమిత్తోఁ జెన్నొంద
నలికభాగంబునఁ గలుగఁ జేసి
జమిలిరేఫలకు దీర్ఘము లిచ్చి నైచ్య
భావంబుగా దాస్యనామంబుఁ జేసి
మహాపదర్లభ మైనమణితమంత్రరవంబు
శ్రవణసంగతి రహస్యముగఁ బలికి
నెమ్మి రతిదేవపూజాక్రియమ్ము దెలిపి
యఖిలసంస్కారములు నిటు లాశ్రయించి
మన్మథపాత్ర్యుఁ డైన యమ్మాణవకుని
మృగవిలోచన నిజశిష్యునిగ వరించె. 46

క. వటుఁ డైనవైష్ణవుని నిటు
విటుఁ జేసెఁగ దేవదేవి వెడమాయలచే
నటు శయ్యఁ జేరఁ గలిగిన
నెటు సెయ్యఁగ లేరు వేశ్య లిల మగవారిన్. 47

క. కాయజుఁడు చేయుమాయల
కాయజుఁడు హరుండు నంబుజాక్షుఁడు లోనై
తోయజనయనలఁ బాయరు
హేయజనుల్ నరు లనంగ నెంత ధరిత్రిన్. 48

గీ. మున్ను కందర్పవిశిఖవిభిన్నహృదయుఁ
డగుచు దిన మొక్కకల్పమై యార్తిఁ బొరలు
విప్రనారాయణునకు నవ్వేలఁదిసురత
లీల నారాత్రి నిమిషంబుఁ బోలి గడచె. 49

వ. ఇవ్విధంబునఁ గతిపయదినంబులు గడచినయనంతరంబున నామా
నినీమణియందుఁ బ్రేమాతిశయంబున నవ్విప్రనారాయణుండు. 50

సీ. దినముఁ జన్నీళ్ళ మజ్జన మాడఁ జలి దాఁకు
నీకంచు వేన్నీళ్ళ నెమ్మిఁ గాఁచు
బుధవార శనివారములు బీరు వోకుండ
శిర సంటు వెచ్చఁగాఁ జేసి నూనెఁ
జమురు పట్టించి యంగములు మర్దన చేయు
మేదించు మేనిపై మినుపపిండి
తల నిమ్మపండ్లు జొబ్బిలఁ బిండి సీకాయఁ
బులిమి తైలపుఁ జిడ్డుపోవ దువ్వ
జలక మాడించు మడుఁగువల్వలు ధరింపఁ
జేయు శిర సార్చుఁ గ్రొమ్ముడి సేయు విరుల
సరులు పైఁ జుట్టి తిరుమణి చాదుకొనిన
దాఁక నిలుచుండు నెదుట నద్దంబు పూని. 51

వ. ఇట్లు నిజసేవాపరాయణుం డైన యవ్విప్రనారాయణు మోహాతి
రేకంబుఁ గనుంగొని జనితామోదంబున నవ్వనితావతంసంబు. 52

ఉ. వైపరి తోఁటనైష్ఠికపువర్తన లన్నియుఁ గట్టిపెట్టి తా
నాపరిచర్యఁ జేసెడు దినంబును దాసరి దాసరీతి నే
నీపరిపాటిఁ దార్చ నగు నింటికి వీనిఁ దటాల్న మత్ప్రతి
జ్ఞాపరిపూర్తి యయ్యె నిఁక జాడ్యము సేయఁబనేమి యిచ్చటన్. 53

వ. అని తలంచి యవ్విప్రనారాయణుం గనుంగొని యవ్వరారోహ
యిట్లనియె. 54

క. సామి యలకించినుం డిట
నే మిగ్రాతిరువడిహా లాశ్రయించుట విని పు
త్రీమోహంబున ముప్పది
యామడ మాయమ్మ వచ్చినదినముఁ జూడన్. 55

గీ. వచ్చి యిపుడు మాయప్పవద్ద నున్న
దంచు నీపొద్దు వింటి నేఁ డటకుఁ బోయి
యెల్లి వచ్చెద నిక్కడఁ దెల్లవాఱఁ
బోయివత్తునె యనుడు నబ్బాసురునకు. 56

గీ. జల్లనియె గుండె ధాతువు ల్పల్లటిల్లె
మొగము పస చెడె దేహంబుబిగువు సడలె
స్వాంతము గలంగెఁ జేకాళ్ళశైత్య మొదవె
నోడలు చెమరించె మఱుమాట వెడలదయ్యె. 57

వ. ఇట్టు గుండె జల్లని వివర్ణవదనుం డై మూర్ఛిల్లిన యట్లుండి కొం డొక సేపునకుఁ దెలివొంది తెప్పిరి దప్పికిఁ బానీయంబు లాని సేదఁ దేఱి ధైర్యంబు గనుంగొని దీనాలాపంబుల నిట్లనియె. 58

గీ. నీవు నీవారియింటికి నేడు పోయి
రేపు వచ్చెద నంటివి రేయి వాల్గ
జాలు నినుఁ బాసి యెట్లుండు నోలతాంగి
యేను వచ్చెద వెంటనే యింటి కనిన. 59

క. ఏ వెఱతు మిమ్మ రమ్మన
దేవర వేంచేసి రేపె తిరువడిహాసు నే
సేవింపఁగఁ బనివిని యెద
భావింపఁగ నింతకంటె భాగ్యముగలదే. 60

—♦ విప్రనారాయణుఁడు దేవదేవి యింటికిం జనుట. ♦—

క. వేంచేయుఁ డనినఁ దెలివి జ
నించెన్ మోహమునకు మనసు నిర్మల మయ్యెం

జాంచల్య ముడిగె నొయ్యనఁ
బంచప్రాణములు డించుపాటును బొందెన్. 61

వ. అంత. 62

ఆ. ఇనుపకలశ మొక్కటియొక్క నిక్షేపించి
కంపకిందఁ గొయ్యికలశ మూటి
చేఁదబొక్కిఁ బొదను జేర్చి భాండంబుల
లోఁతుపీళ్ళ మఱుఁగులోన ముంచి. 63

చ. వటుఁ డపు డాత్మమందిరకవాటము పాటముగా ఘటించి వె
ల్పట నొకతాళ్ళఁ గట్టి పదిలంబుగఁ దాళము పెట్టి తోఁటవా
కిట బలుగాడికి న్గడె బిగించి వెలిం బయుకంప నాటి యి
క్కటముగఁ జంక నద్దిరిపెటూడ ధరించి సరించి వెంబడిన్. 64

సీ. శ్రీవైష్ణవులు నిరీక్షించి రా తిరుమణిఁ
దుడిపితు రన్నట్టిజడుపు మాని
స్మార్తులు చూచిరా సభఁ బరిహాసంబుఁ
జేయుదు రన్నట్టిసిగ్గు విడిచి
బాంధవు ల్గనిరా యపాఙ్క్తేయుఁ డని యిల్లు
చేరనీ రన్నవిచార ముడిగి
ప్రభువు లెఱిఁగిరా యభివాదనమునస
న్మానింప రనునభిమాన మెడలి
వైష్ణవముఁ బట్టెతిరుమణివశముఁ జేసి
బ్రహ్మచర్యంబు జందెముపాలు చేసి
విటజనోచ్ఛిష్ట మైన యక్కుటిలవేశ్య
యంటున నతండు బ్రాహ్మణ్య మంటు పఱచె. 65

క. తోయజభవకులుఁ డాగతిఁ
గాయజు బారిఁ బడి కాముకన్యతుతోఁ ల

జ్ఞాయకుమాట నిజంబుగఁ
జోయెం దోడుకొని వేశ్య పోయిన దారిన్. 66

వ. ఇవ్విధంబున సవ్విప్రవరాత్మజుండు కురంగనయన పిఱుంద
శ్రీరంగపురంబునకుం జని యందు. 67

—♦ వేశ్యవాటికావర్ణనము. ♦—

సీ. వారటద్వజఘనజ్ఞారటద్భ్రుంగజం
ఝ్ఝాటఝుంఝుంక్రియాసారములుంబు
లంజకావిటమనోరంజకస్ఫుటవచ
శ్శ్లాఘలీసంభ్రమోజ్జృంభణంబు
శ్రద్ధవేశ్యాంబికారుద్ధనైజప్రియా
యల్లకావలుంఠత్పల్లవంబు
గోత్రశాలాదివారాత్రిమూర్తి భవ
త్ర్యాపనవేష్యాసధర్మాసనంబు
హారిలావణ్యకన్యాపణ్యాంగనాక
దంబశృంగారచేష్టావిడంబవివిధ
ఖేలనాసాంద్రమదనేంద్రజాలకపట
నాటకంబుఁ గాంచెఁ బురివేశ్యవాటికంబు. 68

సీ. కచ్చించి సొగటాలు గణికలతోఁ గుక్కు-
టాండము ల్పణముగా నాడువారు
ద్రవిణముల్ పైపన్నిదము లొడ్డి మాత్సర్య
గతిఁ గోడిపందెముల్ గట్టువారు
పైచిత్రిగాఁ గోలఁ గాచి పన్నిదమాడి
చెఱకు మోపులు లీల నఱుకువారు
గుఱిచూపి యట కేగి పఱతెంచునందాఁక
నోసఁగినధర్మము ల్మెసఁగువారు

వాఘ్యులై గోత్రిశాలల నధివసించి
విటుల వేశ్యాజనముల చక్కటులఁ దీర్చు
వారలును గల్గి శంబరవైరిసంత
సేట యన నొప్పెన వ్వేశ్యవాటకమును. 69

సీ. లంబస్తనములు మూలస్థానముల నంట
గడితంపుఱవికలఁ గట్టి త్రోచి
పుత్రికానిర్మాల్యపుష్పదామంబులఁ
దొల్లికొప్పులలోనఁ దోపి తుఱిమి
పుక్కిళ్ళనిడెంపుఁదొక్కు మోముగఁ జేసి
కంఠగర్తంబులఁ గాపుఁ గట్టి
బొరుసు మోము బిట్టుబోఁ బవ్వపసపున
మేదించి నూనె చేమొలుఁగు పెట్టి
శునకములు చేరి తరుదిక్కు చూడ రోయు
వయసుత్రో నుండు నన్వేశ్యవాటియందు
సూనశరభుక్తనిర్ముక్తశుష్కపత్రి
భాజనములైన వృద్ధవేశ్యాజనములు. 70

సీ. కట్టువర్గము లమ్మగారిపుట్టంబులు
తిలకంబు పూఁతచొదిరపుఁ బిండి
కంఠభూషణము లక్కలి దేవిపాదాలు
భోగవిత్తము హరిజోగుకొలుపు
లారాధ్యదైవతం బంబికాహ్వయశక్తి
యత్యార్ఘ్యమద్యంబు నిత్యసేవ
శ్రవణీయసుఖగోష్ఠి బవినిలసంగీత
మెల్లారసివసత్తు లిష్టసఖులు
నగుచుఁ దముఁ జూచి విటజనుల్ నగుచునుండ
నందనలపంచసాయకమందిరములు.

గాచుజాగిలములు వో లెఁ గాచి యుండు
వేశ్యమాతలు తద్వార వేదికలను. 71

సీ. చిట్టికుంకుముబొట్టుఁ బెట్టు నెన్నుదుటికిఁ
గెంపారుపూఁత చెంద్రంపబొట్టు
జమిలిముత్తెంపుఁ గంఠసరి దాల్చు మెడకును
దట్టంపుఁదోలుపాదాలపేర్లు
వలిపంపుసన్నచల్వలుఁ గట్టు మేనికి
మాతపుట్టపువెత్తి మైలబట్ట
కపురపీడెము వెల్తి గావి యానోటికిఁ
గోటమూలినట్టి యాగొంటువక్క
కటకటా పువ్వు లమ్మునంగడినె కట్టె
లమ్మఁ జేసెను మిమ్ము దైవ మ్మటంచు
వృద్ధవేశ్యల వగపింతు రుద్ధతప్రి
వర్తు లగుధూర్తవిటులు దుర్వారనటులు. 72

వ. ఇట్లనేకప్రకారంబు లయిన వేశ్యావిటప్రకారంబులఁ గనుంగొనుచు నశ్వపతినారాయణుండు దేవదేవీపురస్సరంబు గాఁదదీయగృహంబుఁ బ్రవేశించి యందు. 73

సీ. సకినెలపట్టుమంచముఁ బట్టుతలగడ
బటువుబిళ్ళలు సూర్యపుటపుఁబటుపుఁ
జేదివ్వెప్రతిమ చౌశీతిబంధములమే
ల్కట్టు గొజ్జఁగినీటిగాజుకొప్పె
వట్టివేళ్ళసురఁటి జవ్వాదిపకెనతట్టు
పునుఁగుఁ బిఁగాణికప్పురపుఁ గోవి
గొడుగుఁబావలు గంధపొడిపెట్టె నునుసాన
గడియారం మంచముకాలిపీట

మెండినాళంబుఁ బటికింపుగిండి చెంబు
జాలవల్లిఁ బైఁడి భాగాలబరిణ
పంజరశుకంబు మణితళ్ళిద్దముఁ బఱిచు
పావురపుజోడుఁ గలరతాగారమునను. 74

గీ. దేవదేవీసమేతుఁడై భావభవవి
హారగతి నుండె నన్యవిచార ముడిగి
ప్రీతిన పీడేర్పుకొని యుదంచితమనఃప్ర
మోదపరిపూర్తి నుండె నప్పైదలియును. 75

క. అటు దేవదేవి యవ్వటు
విటుఁ జేసె నటన్న వార్త వినినప్పుడె కా
ర్పటికగతి దాసురాలై
తటుకున నయ్యప్ప లంజతనముం బాసెన్. 76

క. కందంబుల నలుగనియర
విందంబుల నరసి రంగవిభుపూజకు నే
నందంబులు సేయును నను
చందంబున నేగుదెంచె శరదృతు వంతన్. 77

—♦ శరదృతువర్ణనము. ♦—

సీ. కార్తికచంద్రివిస్ఫూర్తివక్త్రముతోడఁ
జంద్రికామందహాసంబుతోడ
హారిదంతరాచ్ఛవిస్ఫురణాంబరముతోడ
వియులకల్హారనేత్రములతోడఁ
దారావళీస్వచ్ఛహారావళులతోడ
నతులరాజమరాళగతులతోడ
నభ్రవిభ్రమకళాదభ్రమధ్యముతోడ
నమలకోమలపదాబ్జములతోడ

విలసత్కాశచామర పరితతితోడ
సకల కవిరాజ సంస్తుత్య వికలుషైక
జీవనస్థితి నెరసె నానావనీత
లముల శారదసముద్యద్విలాసలక్ష్మి. 78

వ. ఆసమయంబున. 79

సీ. పరిమళమై యొకచోటఁ బాటీర
కర్పూరకస్తూరికాద్యుల కమ్మతావి
దండిగా నొకచోటఁ బిండివంటల వెంటఁ
బ్రభవించు తైలాజ్యపరిమళములు
రహి నొకచోటఁ గూరలతాళి పోఁతల
తోరంపుసంభార సౌరభములు
రమణ నొక్కొకచో సురభ్రాజి మస్తముల్
గమలించుమాంసంపుగములకముఱు
గ్రమ్ముకొని యొక్కచో నంబికాసమర్చ
నాసముద్భూతమై రేయువాసనలును
లలికెఁ దోఁతోఁపు లాడఁగ లక్ష్మిదేవి
పండుగే తెంచెఁ గన్నుల పండువగుచు. 80

వ. ఆదినంబునందు. 81

ఉ. అచ్చినవంక నైనఁ దమ రావల నప్పుల దూసి యైనను
మ్ముచ్చిలి యైన జీవధనము ల్దెగ నమ్మను వెట్టి యైన నుం
జెచ్చుగ సంతరించి తమపేదఱికంబుఁ దలంప కర్థము
ల్దెచ్చి యనుంగువేశ్యలకుఁ దీర్తురు పండుగదండుగ ల్విటుల్. 82

క. మింతజనదత్తమేషీ
కంఠసముద్భూతరవము కడు నెమ్మది ను
త్కంఠ సలిపె వేశ్యాకల
కంతుల కత్తఱి గుహాపకంఠములందున్. 83

వ. ఆసమయంబున. 84

సీ. గణికాభుజంగసంఘటనయాతాయాత
జామాతృభయదవాచాప్రభూత
వివిధమాయోపాయవిరచనప్రఖ్యాత
కర్కశోఘనసదృక్కటీకచేత
నందనీపల్లవానందదత్తవిఘాత
జనపాతశూన్యాంగజప్రపాత
యజ్ఞాతగోత్రనామాకారనిజతాత
యుల్లాఘుశతసహాయప్రమేత
జైత్రహృజ్జవ్యనన్యస్తశస్త్రజాత
కలుషవీక్షాతిరస్కృతోజ్జ్వలదలాప
పరుషవాచార్భటీసముత్పాద్యమాన
దీర్ఘనిర్ఘాత యద్దేవదేవిమాత. 85

గీ. విత్తమీ లేనివిటకోటి వెడలమీటి
విరహపరితాపమును జేది వెతల నేచి
మదనధాటి యనంఘఁ బేరొందవి వెలయు
విపులమై కేయమణిక యావృద్ధగణిక. 86

గీ. ఊరివేశ్యలకెల్లను వారివారి
విటుల పంపుగతగవు లంపుటలు చూచి
విప్రనారాయణుని విటవృత్తిఁ దనకు
నీవి లేకున్కఁ గని దేవదేవి కనియె. 87

క. తమ్ముల వల పంపకుండఁగ
గ్రిమ్మవిటులఁ గలయు నేర్పుఁ గఱపెను మనకున్
గొమ్మరో తామరపాకును
గుమ్మరిపుపువులును బసమగుపువులు సుమ్మీ. 88

వ. అని విప్రనారాయణునుగుఱించి. 89

క. చక్కఁదన మెంత గలిగిన
రొక్కమునకుఁ గాని వల్లరు మనంచు జనుల్
రొక్కములు జోలె లాతని
చక్కఁదనం బేమి చూచి సకియ వలచితో. 90

క. నవమదను నైన మెచ్చవు
తవిలితి వీయవబోడితలకు వలచితో
ధవళాక్షి వీని వ్రేలుం
జెవ్రులకు వలచితివో పిల్ల సిగకు వలచితో. 91

ఆ. రమణి యితఁడు తిరువరంగంబెరయుకో వె
లనుచు బికిర మెత్తినపుడె జనులు
వీఁడె దేవదేవి విటుఁ డన్నఁ దలవంచు
కొనఁగ వలసె నాకుఁ గువలయాక్షి. 92

ఆ. తొత్తుపేరఁ బెట్టి దొడుకుపేరను బెట్టి
పిల్లికూనపేరఁ బెట్టి యిల్లు
వెళ్ళ లే దటంచు మెల్లన ముదుగులు
పాఱ విడుచు చుండుఁ బాటఁ బాట. 93

ఉ. వేసరి యే మటన్న నిలు వెల్వడఁ జాలఁడు చేత నంటిమా
దాసరిబుట్టయుఁ ముదుక ధావళిదట్టియుఁ గాని కాన మో
కేసరిమధ్య నీవ్రతిన గల్చె నిఁక న్బరిపాటి నొయ్య నీ
దాసరి నోసరింప వలదా సరివేశ్యలు నవ్వకుండఁగన్. 94

వ. అనినఁ దల్లి కాగణికామతల్లి యిట్లనియె. 95

క. పొది నప్పయు నేనును బ
న్నిద మాడినకోస మితనిఁ దెచ్చితి నిఁక నా
కొదవపని తీరెను నిఁక నీ
కొదవదొ యని పల్కఁ దల్లి కూఁతున కనియెన్. 96

ఆ. తెఱవ నేను నోరుఁ దెఱవ కుండఁగఁ గాక
చొరవ గొనుచు నిల్లు చొర వశంబె
పఱవఁ బొమ్ము టాట బరువటే నాకు నీ
యఱవఁ దోఁకఁ గోసి యఱవఁ జూతు. 97

క. ఇటు చూడు నాప్రతాపము
విటులం జోఁపిషట నాదువిద్య మొదల నీ
వటుఁ డేమి బ్రాంతి నాయా
ర్భటికిన్ భూతాలు బెదరి పాఱుచు నుండున్. 98

క. వెచ్చానకు లే దనఁగా
నిచ్చటి కేతెంచి యూతఁ డిచ్చిన మేలే
వచ్చినది లాగుకొనిమఱి
చొచ్చో యసిపింతు నిదియ నూ మత మనుచున్. 99

సీ. పసపుఁ బిండియు నగపాలు గూర్చినపూఁత
బొట్టుపైఁ జెదిరింపు బొట్టుపెట్టి
క్రొత్తకమ్ములతోడి కూసలమ్మపటంబుఁ
గటి విప్పగా రెండుకిల్లు గట్టి
మేలిమి పైడిపాగాల సంగతిని వ
ర్తనమాడు పెద్దపాదాలమర్చి
కప్పుపయ్యెద క్రిందుగా జాఱుచనుదోయి
పొరి బొజ్జకడుపుపైఁ బొరలఁ బెట్టి
విప్రనారాయణోచ్చాటవిధికి దేవ
దేవి యంపిన మంత్రశక్తియును బోలి
సోలుచును వచ్చె మధుమదాలోల విహ్వల
వివిధ మాయాప్రభూత యవ్వేశ్యమాత. 100

వ. ఇట్లు వచ్చి నిలిచి విప్రనారాయణుం జేరంగొని. 101

ఉ. అల్లునియమ్మగారి కిపు డాఁకలి గాదొకొ యింటి కేమియుం
జిల్లర వెచ్చసచ్చములుఁ జీరలు నంపవు తోడివేశ్యకాం
డ్లెల్లను బాడుగ న్దగవు లీయఁగఁ దాఁకి తలంప వీవు చే
బెల్లుగ రొక్క మీక ధరఁ బిల్తురె వారసతు ల్విటావళిన్. 102

సీ. నీపట్టుతిరుమణి నీతిరుచూర్ణంబు
గణికకు వెండిబంగారు లౌనె
నీపుట్టగోఁచియు నీకావి వేష్టము
ల్వారకాంతకుఁ బట్టుచీర లౌనె
నీముష్టిగూడయు నీతులసిసరులు
వేశ్యకుఁ బంగరు వేట లౌనె
నీవేదశాస్త్రము ల్నీసంధ్య జపములు
లంజెసానికిఁ బంజులగము లౌనె
పెట్ట నోపితివా యొప్ప టట్టె యుండు
పెట్ట లేకున్న విచ్చేయి పెందలకడ
మొదల రోయింతులకు నొక్కముడుపె గాక
నీసదాచార మేలయ్య దాసరయ్య. 103

—♦ విప్రనారాయణుండు తన పువ్వులతోఁట కరుగుట. ♦—

వ. అని మఱియు ననేకప్రకారంబుల నవ్వాటునకుఁ గర్ణకఠోరంబుగా
నుచ్చాటవచనంబుల భర్జించిన నతండు. 104

గీ. వేశ్యమాతయు గతవయోవృద్ధ యైన
యది సురాపాన మొనరించె నిట్టివేళఁ
గోఁతి కలు ద్రావి యుండఁ దేలుగుట్ట భూత
మావహించినయట్టి స్వభావ మరయ. 105

ఉ. శుద్ధయపాత్రురా లిది యశుద్ధపునోరును సిగ్గొకింత లే
కుద్ధతిలీలఁ జాలఁ బరుషోచ్చరణంబుల బూతు లాడెడుం

బుద్ధి గణింప నిల్వెడలిపోవుట కార్యము పోవకున్న నీ
వృద్ధపిశాచికి న్వలయువిత్తము నా కది యెందుఁ గల్గెడిన్. 106

క. రూక లటఁ గోక లట మఱి
యాకులు పోక లట గోఱియ లట యువినాకు
న్నేముండుట తథ్యం బట
పో కుండుట నీతి గాదు బుద్ధిఁ దలంపన్. 107

వ. అని నిశ్చయించి. 108

చ. కరమున బ్రూసికుండికయుఁ గంబళ మాంసమునందు జంకపైఁ
దిరిపపుఁగూడయు న్గొని తదీయనివాసము నిర్గమించి యె
వ్వరు దనుఁజూతురో యనుచు వంకమునుం గిడి నమ్రవక్త్రుఁడై
యరిగె నతండు పంచశరునల్గుఁబమూటకుఁ దొంటితోఁటకున్. 109

వ. ఇట్లు చని యం దొక్కతరుమూలంబున నాసీనుండై యతఁడు తన
మనంబున. 110

చ జనని ధవాళి నిట్లు విరసంబులు నన్నని వెళ్ళఁదోలుట
ల్విననుసుమీ యొకింతయును వీనుల నప్పుడు దేవదేవి య
వ్వనిత యెఱింగెనేనియు నవశ్యముఁ దల్లి నదల్చి నన్నుఁ బి
ల్వను జెలిఁ బుచ్చునో మదిఁ గలంకపుమానుపఁ దా నెవచ్చునో.

వ. అని మఱియును.

క. ఆరీతిఁ బ్రేమ గల్గిన
నారీతిలకంబు రాదె నావెంటనె తే
దారీతి యింక శంబర
వైరీతిఁ దరించునట్టివల నెయ్యదియో.

గీ. సతికిఁ బతికి సమానమై జరగదేని
నిరయమున లేదు వలపంతసగ్రహంబు
సతికిఁ బతికి సమానమై జరగెనేని
స్వర్గమున లేదు వలపంతసౌఖ్య మెన్న. 114

చ. తలఁచిన సిద్ధ్రాను చలిదార్కొను మోసలఁ బేర నెవ్వనిం
బిలిచిన గుండె జల్లుమనఁ బేస్చుమనఃపరితాపవేదన
ల్నిలిచినచోట నిల్వ ధృతి నెక్కొన డక్కట రంగరంగ తా
వలచినయింతిఁ గాయువగ నద్దుపుబిా పగవారికేసియున్. 115

ఉ. నున్నని బాహుమూలములు నూత్నసుధాంగ్నస ముల్కు పల్కులుం
దిన్నని మేనుదీవయు హదింపిననిబ్బపుగబ్బిగుబ్బలు
న్గన్నుల నన్వనెమ్మొగముఁ గన్నులఁ గట్టినయట్లు నాకు నా
చున్నది నామతిభ్రమణమో మరుమాయయొ కొమ్మనైజమో. 116

తే. లాలనముఁ జేసి మన్మథకేళి నేఁడు
కుసుమకోమలి యెవ్వనిఁ గూడునో కొ
యతఁడు దొల్లిజన్మమునను శ్రీహరిని బైఁడి
పుష్పములఁ బూజచేసిన పుణ్యతముఁడు. 117

గీ. అతివ వైష్ణవమతరహస్యమునఁ జాల
బరిచయముఁ గన్నయట్టిప్రసన్నురాలు
శూద్రసంపర్కమున కేలచొచ్చు మరల
నిచ్చటికి నేతప్రొద్దైన వచ్చుఁగాక.

మ. తతి నూత్లేఁబను తెప్పుడు స్తనము చేరంగ్లి వర్తించుపు
ణ్యాతపశ్శాలికిఁ గాక నిర్ధనునకు న్నాకేల సిద్ధించు నా
సతిసంపర్క మవక్రవిక్రమవిరాజద్రాజదోర్దండమం
డితసామ్రాజ్యవధూటి చేరఁ జను నే నిర్భాగ్యదామోదరున్. 119

క. ధనమూలము జగమంతయు
ధనవంతునిఁగాని వేశ్యతల్లి దరిఁజొర
దనకూఁతుఁ జేరనీయదు
ధనమే డది దాని కొసఁగఁ దథ్యం బైనన్. 120

సీ. మానిఁడిబ్రాఁకునసైశవుఁను బండ్లు గల్పించి
చెఱకున కేల సృజింపఁడాయె

బూతిగడ్డకును సైతమును గంధ మొసరించి
కుందనంబున కేల కూర్పఁడాయె
బోలము తాళ్ళకు సైతమును బుష్పఁ గల్పించి
శ్రీగంధమున కేల చేర్పఁడాయెఁ
బుట్టకొప్పుల సైతమును దేనె గలిగించి
గేదంగి కేల గల్గింపఁడాయె
ధర నిరక్షరకుక్షుల ధన్యులఁ జేసి
విద్య గలవారి నేల దరిద్రులఁ జేసె
బ్రహ్మ నననేటి కతని నేర్పరిగ నెంచి
పుడమి వర్ణించు కవులఁ జెప్పెడిది గాక. 121

ఆ. తమరు నేమి త్రవ్వి తల కెత్తి రసురు లీ
యుర్వి మనుజు లేమి యొసఁగ రైరి
నింగి వారసతుల నిస్సారలఁ జేసి
పుడమి మాతృభూతముల సృజించె. 122

క. నల్లి గలశయ్య నిద్రయుఁ
జల్లి గలఘటాంబువంకఁ జేర్చిననీరుఁ
దల్లి గల వేశ్యఁ దగిలిన
పల్లవసుఖములును బోధిపల్లవసుఖముల్. 123

క. లతకూనలు జవ్వనమున
వితతంబుగ వార్ధకము ప్రవేశంబైనన్
శతకంచుకంబు లూడ్చిన
కృతకఫణుల్ వారసతులు కేవల మరయన్. 124

సీ. ధనముకొంప్పెరదండఁ బెనుభూత మున్నట్లు
గంగదరి మొసలి గాచినట్లు
రసకూపమున నంటి రాకట్టు గలయట్లు
మొగిలిపువ్వున ముండ్లు మొలచినట్లు

అమృతకుంభము నగ్ని యానరించినయట్లు
శ్రీగంధమునఁ బాము చేరినట్లు
తేనెతెట్టకుఁ జుట్టు రానీఁగ లున్నట్లు
పట్టుకంకటి నల్లి పట్టినట్లు
అవని వేశ్యలపేరి శ్రేయస్సులకును
దల్లులని యెడి విఘ్నాధిదైవతముల
విధి విచారము లేక యెవ్విధి సృజించె
వేశ్యరతిసౌఖ్య మెఱుఁగునే వేదజడుఁడు. 125

క. లోలత విటుఁడైనం దా
నేలా తల్లుల సృజించు విటు వేశ్యలకున్
గీ లెఱుఁగక చెఱిచెను విధి
కూళయి గొడ్రాలు బిడ్డకు ట్టెమెఱుఁగున్. 126

గీ. బ్రహ్మచర్యంబునకు నంతరాయ మొదవె
జలజముఖి మైత్రియును గొనసాగదయ్యె
వసుధఁ బరికింప నిది సుఖాఖ్యతము చెడ్డ
సుఖము దక్కె దటన్నవచోసరూఢి. 127

గీ. ప్రాగ్భవంబునఁ జేసిన పాతకంబు
నతనుసంతాప మనుపేర ననుభవింపఁ
జేయుచున్నాఁడు శ్రీరంగశాయి వగవ
నేల కర్మక్షయం బౌట మేలు గాదె. 128

ఆ. శతభిషగ్వరుండు సకలౌషధీనాథుఁ
డమృతధాముఁ డిందిరానుజన్ముఁ
డట్టి రాజు రాజయక్ష్మచేఁ గృశియించుఁ
గర్మ మనుభవమునఁ గాక చెడునె. 129

మ. నిల నీయంగము రంగనాథ వరమే ని న్నేఁడెద న్మహీ
సలిలాగ్ని శ్వసనాభ్రభూతత్వముల నాచంద్రార్క నెమ్మనఁ దా

య్యాలిఘుర్మాంబుల నింతి నేత్రములఁ గీరాలాప ప్రాణంబులన్
జలజాతేక్షణ మేనిలోనిబయలన్ సాయుజ్య మొందింపవే. 130

విప్రనారాయణుఁ డాపన్నివారణార్థమై శ్రీరంగమూర్తిని స్మరించుట.

వ. అని ప్రార్థించి యాపదుద్ధరణంబునకు హరిచరణస్మరణం బశరణం
బని నిటలతటఘటితాంజలి యై యిట్లనియె. 131

ఆ. రంగ రంగనాథ రంగేశ రంగేంద్ర
రంగశాయి యో పురాణపురుష
నీకృపావిభూతి నీబంటుబంటుల
పాదధూళి మీఁదఁ బరఁగఁ జేయు. 132

సీ. అక్షీణకరుణాకటాక్షవీక్షణరమా
రక్షితాపాంగ సారంగవిభుని
బ్రహ్మసుఖాహారపశ్యతోహారగరుద్రథ
సార్వభౌమతురంగవిభుని
శయనీయవత్సహస్రఫణామణిప్రభా
రాజిరాజత్తనూరంగవిభుని
బహుముఖబ్రహ్మాండభాండకాండాంతశ్చ
రాచరావలిబాహ్యరంగవిభుని
మానసంబునఁ దలఁచెద మన్మథప్ర
హారసంతాపితాభీరచారుభీరు
బృందనవకేళిధాము కళిందజాత
రంగ రంగద్విభుని శ్రీరంగవిభుని. 133

వ. అని వేఁడి తలంచిన. 134

సీ. శరణాగతావన స్ఫురణాసముల్ల
సత్కరుణాకటాక్షకింకరవిభుండు
కమలాకుచద్వయీవిమలాచ్ఛలేప
కుంకుమలాలితాంకవక్షోవిభుండు

ప్రపదానిశానతతిప్రపదానవాధిప
ద్వీపదానవాహింతాధికవిభుండు
శతకోటి రవివిభాతతికోటిహాసితతీ
తీకోటినాగనవాధిరప్రభుండు
శక్తిహీనక వేశ్యానురక్తిఁ బొరలు
భక్తపరితాప ముడుప నుద్యుక్తుఁ డగును
రంగదాత్మాంఘ్రినత్రకీరంగదంత
రంగవాంఛాప్రదాయి శ్రీరంగశాయి. 135

సీ. వెడఁదనెన్నుదుటిపై వెడదాకు వెడుపుతో
దిద్ది తీర్చినపట్టె తిరుమణియును
వామంపుఁబట్టెలనడుమ శుద్ధసువర్ణ
వర్ణమై తనరుశ్రీచూర్ణరేఖ
కంబుకంఠమునఁ బంగరుహారతులతో
భాసిల్లెడుతులసిపూసపేర్లు
మెఱుఁగారుపొక్కిలిమెఱపుతోఁ
దాల్చినసవ్యాసమగునొంటిజన్నిదంబు
గ్రొత్తపెన్నాలిమాంజిగిలొత్తిపినట్టి
పసపుఁ గాపీనమును బచ్చబట్టతసుపు
నమరఁ జిన్నారిచిఱుతపాయమున నున్న
జగతి బలి వేఁడినట్టి వేషము ధరించి. 136

క. సారమణిఖచితమగు బం
గారపుఁ దనగిన్నె వారకామిని కొసఁగన్
శ్రీరంగదివ్యధామ వి
హారుఁడు స్వాయమర్థచోరుఁడై కొనిపోయెన్. 137

శా. కల్యాణైకనిదాన దానవజనప్రత్రాసనత్కారితా
త్మీయేంద్రప్రవితాన తానవయుతశ్రీపద్మజాపోషితా

హల్యాశాపసదీన దీనజనరక్షాశాహారోద్భాత్రికా
సల్యాగర్భవినాశ దానవకళాచార్యాన్వయగ్రామణీ. 138

క. బర్హితురంగమ జనకస
మర్హా ధనుర్దళనయాభిఖ్యాత్రావేళా
నిర్హేతుక గౌతమముని
గార్హస్థ్య పాదపాద కమలవినోదా. 139

మాలినీవృత్తము. ఉచితసుఖతరంగా యుద్ధఘోరాంతరంగా
పదవినుతితరంగా భవ్యతేజోయుగంగా
విదితకపితురంగా విద్ధమాయాకురంగా
ప్రదరనిధనిషంగా భక్తభవ్యానుషంగా. 140

గద్య.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్ర పవిత్ర
శ్రీరామచంద్రకరుణాతరంగితవైభవ సారంగునృసింహ
మంత్రిపుంగవతనూభవ పరిచితభగవద్భాగవతకైంకర్య
విధాన తమ్మయాభిధాన ప్రణీతంబైన
వైజయంతీవిలాసంబను మహాప్ర
బంధంబునందు ద్వితీయా
శ్వాసము.



శ్రీ

# వైజయంతీ విలాసము

అను

# విప్రనారాయణ చరిత్రము.



## చతుర్థాశ్వాసము.



శ్రీ త్రిభువన జనస్తుతి
పాత్రా ప్రయప్రసన్న భావవిరాజ
ద్గాత్ర పరిచారికాధిక
చిత్రితముని చిత్తధామ శ్రీరఘురామా. 1

వ. అవధరింపు మట్లు దేవదేవిగృహంబుఁ బ్రవేశించిన నతనిఁ గనుం
గొని యావేశ్యమాత యిట్లనియె. 2

ఆ. ఎందునుండి వచ్చి తెవ్వరాయనవు పే
రెద్ది యిటకు నేఁ బనేమి యనిన
వేశ్యమాత కనియె విజనశాలాత్రియా
కృశితవటుండు శాంబరీవటుండు. 3

ఉ. ఓయలివేణి యిప్పురిని యుండును నయ్యఁడఁ గాను విప్రనా
రాయణు కూర్మిశిష్యుఁడను రంగఁ డటంచును పేరు మాకు నేఁ
డాయన పంపినాఁ డొకయపర్ఘ్యసువస్తువు కొమ్మ యందుకో
వన్నెయునిది గిన్నె యిచ్చె వెడపూజల వెల్లికి లంజెతల్లికిన్. 4

వ. సతతము బ్రహ్మరుద్రసురసంయమిముఖ్యుల నాత్మమాయ మో
హితులుగఁ జేయుస్వామి వారుఁ గుంభిని మోహితుఁ జేయ లేక ప్ర

కృతజనుఁ డిట్లు తాను దసగిన్నె నొసంగెను బంటుకోసమై
మతకరి వేశ్యమాత వెసమాయ లజేయులు విష్ణుమాయకున్. 5

వ. ఇట్లు గిన్నె నొసంగినఁ గైకొని పరిమోదమానమానసయై యతని నంతర్గృహంబునకుఁ దోడ్కొని చని నూత్నరత్నకంబళాస్తరణంబున సుఖాసీనుం గావించె. 6

గీ. జాలవల్లికతోడ భాగాలుఁ దెల్ల
నాకులును గైరవళ్ళు గంధాక్షతములుఁ
గప్పురముఁ బైఁడి చెంబులు దుప్పటియు
నెదుటఁ బెట్టిన నవ్విటుఁ డిట్టు లనియె. 7

క. ఓ కామిని విడె మేటికి
మాకు సదా బ్రహ్మచారి మహి నిది మీరు
న్నా కొసఁగ రాదు మేమున్
గైకొన నుచితంబె యనినఁ గాంత పలికెన్. 8

క. మీ రొల్ల కున్న మీయయ్య
గారికి నిం డనిన నతఁడు గణికాంబికతో
వారికి నిచ్చుట మాకప
చారము వారలును బ్రహ్మచారులు గారే. 9

వ అనిన వేశ్యాంబ వటున కిట్లనియె. 10

ఉ. మస్త్రివోలె మాపడుచు మూర్ఖసరణ్ జళికింపఁ బూపని
వెఱ్ఱితనాలు మాన వని వేశ్య కిటారిఁగ నింటనుండి దాఁ
జెఱ్ఱుఁ గొసగించుకొని చెప్పఁడు జేయఁడు లేచి పోయె మీ
వెఱ్ఱియుగారు మంచిగురువే కలిగెం జగు వేల్పు చెప్పనో. 11

చ. అలుకలు చాలు రన్నన్నయా యయగారిఁ దమమ్మకింత బ
ల్పులకుఁ బనేమి తాఁ దొలఁగి పోయినయప్పటినుండి పిల్ల యుం
బలుకదు మమ్ముఁ గూడి పెనుబాముగు చేయ దిదేమి కింటెంతోఁ
గలహ మటంచుఁ బల్కి సల కైతవమాణవకుండు దానితోన్. 12

క. నే రమ్మనిన న్వచ్చెనె
మీరలె పిలువఁ దగుఁ గాక మీయల్లుఁడు దో
తేరఁ దగువారిఁ బంపుఁడు
మీ రెఱుఁగనితగవు గలదె మేదినియందున్. 13

క. నావుడు నవ్వేశ్యాంబిక
యావటువుం జూచి పిలువ నంపఁగ నే మా
యావి యతఁ డింత కేమెడఁ
బోఁప్రను తా వెఱుఁగ మెటకుఁ బోనుమటన్నన్. 14

ఉ. ఏయెడ కేలపోవు నతఁ డెవ్వరికైనను జిక్కువాఁడె తా
నాయన మీకు నీవలను వచ్చినయప్పుడు గద్ది దా సుఖో
పాయత నున్నవాఁడు శ్రుతిపాఠము సేయుచుఁ దోఁటలోన నే
మాయయుగారటంబు నలమూయలమూరి చనెం దటాలునన్. 15

క. దయ యెటువంటిదొ రంగే
శయునకును దాసుపై నిజశ్రీపాద
ద్వయుఁ దద్వేశ్యాగారము
గయికొంటెఁ బవిత్రితంబు గా నొనరించెన్. 16

గీ. అటుల వటుఁ డేగ నంత నక్కుటిలమతులు
పసిఁడిగిన్నియఁ జూచి యప్పాఱు కేడ
దిట్టనస్తుప్ర మనలఁ గనట్టునట్టి
రీతివలె నున్నయది దీనిరీతి యనుచు. 17

క. చెన్నారు పసిఁడిగిన్నియఁ
గన్నారం గనియు నమ్మక పరీక్షార్థం
బన్నారీమణు లపు డది
సొన్నారిం బిలిచి తెచ్చి చూపి రటయున్. 18

గీ. ఆతఁడు నది చూచి దానిపై నిరత మైన
శంఖచక్రాంకముల విలాసంబువలన

దేవధన మాటఁ దెలిసియుఁ దెలియనట్లు
గిన్నె మేలైన దిది పదార్వన్నె పసిఁడి.

క. మీ వెలఁది కూడఁబెట్టిన
రో వెలఁ జేయించుకొంటిరో మీ కెవరో
రో వాటున నిడిరో విటుల్
తా వెట్టిదో యనిన వేశ్యతల్లి యతనితోన్.

సీ. మా దేవదేవి సహోదరియును దాను
నిషధేశుఁ డగుచోళనృపతిఁ గాంచి
యాతనికడ గీతికావళుల్ వినిపించు
నవ్వేళ నోడబేహారి యొకఁడు
నృపతికి గిన్నెఁ గానుక చేసి పొడగన్న
సంగీతవిద్యాప్రసంగవేళ
వచ్చినదగుట నవ్వసుమతీనాథుండు
నుచితజ్ఞుఁడై మాకు నొసఁగె ననిన
దానికపటోక్తులకు నట్ల తప్పదనుచు
వాఁడు మెయికొని యేదాత యీఁడు మీకుఁ
గోరినపదార్థ మని తాను వారిఁ బొగడి
బాహిరంబున వానశ్యత్తోహారుండు. 21

వ. తదనంతరంబ.

క. పీడెము గంధము నిడి యా
నాడింధము ననిచి కజ్జనపు సుగంతో నో
చేడియ యిన్నాళ్ళఱుఁగము
బోడఁకు బంగారుపెట్టెపోఁ బఱికింపన్. 23

గీ. ఇంతబంగారుగిన్నియ సంతరించు
వాఁడు దీనికి జోడైన పైఁడిపళ్ళె

రంబు చిటిపొటిగిన్నెలు చెంబు సంత
రించకుండునొకో యమ్మ యెంచుకొమ్మ. 24

గీ. మండగుడిపేర నగరాననుండు నితని
తండ్రి లష్కాధికారి రయూతఁడు గడించి
నట్టిసొమ్ములు గాఁబోలు నట్టి వెన్ని
గలవొ యన్నియు నొయ్యన వలయుఁ గొనఁగ. 25

వ. అని యతని మగుడం బిల్వఁ దలఁచి. 26

—♦ విప్రనారాయణుం దోడ్తేర వేశ్యమాత కావేరిం బుచ్చుట ♦—

క. శ్రీరంగఁ బాపుదమొ మన
గారిం బంపుదమొ యంబికం బుత్తమొ కా
వేరిం బాపుదమో య
ల్లారిం బాపుదమొ యని తలఁచి వారలత్తోన్. 27

క. ఆరయ సమయోచితవా
చారచనప్రౌఢి మిగుల సడిసన్నది కా
వేరియ కుంటెనపనిఁ గడి
దేరినయది పంపవలయు దీనినె యనుచున్. 28

సీ. గమకించుచమరివాలము లోనఁ గీలించి
యుప్పరంబుగ నోరకొప్పు దిద్ది
నాభినామంబు నెన్నడుమఁ గస్తురిరేఖ
మోసుగాఁ బాపట మోయఁ దీర్చి
తాటంకవలయమధ్యమునఁ జెందొవపువ్వు
లవతంసకముగాను హత్తుకొల్పి
మడుఁగుఁజెంగావిపావడమీఁద వెలిపట్టు
చీరకుచ్చెలు నేలఁ జీఱఁ గట్టి
మెఱుఁగుఁదీఁగెయుఁ బెద్దముక్కఱయుఁ బెట్టి
దండతాయెతులును సందిదండ లునిచి

కేల గాజులు గాడ సరాలు దొడిగి
ప్రేమఁ గైసేసి యద్దానిఁ బెంపు చేసి. 29

వ. అప్పు డమ్మొకసలి యిట్లనియె. 30

గీ. ఏమనవు కోపగించుకొం చిల్లు వెడలి
పొమ్మనిన నట్లు దాసరిబోడ పోయె
తోఁటలో నున్నవాఁడట బోఁటి నీవు
సమ్మతిలఁ బల్కి యతనిఁ దోడ్తెమ్మటన్న. 31

క. అమ్మాటకు నది యిట్లను
సమ్మతి కాకేమి పిలువ సమ్మతి గాదా
రమ్మనియంటేఁ జాలును
బమ్మఁడు నావెంటఁ బెద్దపరుగున వచ్చున్. 32

క. వలపుఁ గలయంటుగానికిఁ
బిలుపే దేవేంద్రపదవి ప్రియురాలు దన
న్బిలిచెననువార్త విన్నను
నిలిచినచో నిలువనేర్చునే నిముసంబున్. 33

వ. అది యెంతపని యిప్పుడే తోడితెత్తు నని చని యవ్విప్రనారాయ
ణుం గనుంగొని యిట్లనియె 34

గీ. దొంగవలె వచ్చి యిచ్చట డొంగినావ
దేమయా బావగారు పెద్దామె కోప
గించినందులకా బళా మంచివాఁడ
వేమనందును మసలావె యే వివేకి 35

ఆ. అప్పు డిల్లు వెడలి యటు వీథికై నీవు
పోవ దేవదేవి పొగిలి మిగులఁ
దల్లిఁ గోపగించి తమరిఁ బిల్వమటంచు
నంపె నన్ను నీవు నంతలోన. 36

ఉ. ఎక్కడఁబోయితో యెఱుఁగ కేరుచు వెంటనెవచ్చి యప్పు డే
దిక్కున నిన్నుఁగానక మది న్వెఱఁగంగుచు దేవుఁడాన నీ
బిక్కర మెత్తుచో నటవపిల్లలవాడల వింతసేపు నీ
యిక్కువ లన్నియు న్వెదకి యే నిటవచ్చితి లేచి రావయా. 37

వ. అనిన నతం డిట్లనియె 38

క. రమ్మనెనా మఱి యేమనెఁ
బిమ్మట నీయక్క నీకుఁ బెరుమాళ్ళానే
యమ్మ నదల్చెనె యూబిడ
సమ్మతినే వచ్చినావా నకియరౌ చెప్పుమా. 39

క. మీయక్క పిలుపు మనెనో
మీయమ్మయుఁ బిలువుమనెను మృష లాడితివా
మీయక్కతోడు నీకున్
మీయప్పకుఁ దప్పుమను సుమీ కావేరీ. 40

క. అని మఱియు మఱియు నిట్లడి
గినమాటలె యడుగుఁ బ్రియసఖీవార్తలనా
తనతం బునరుక్తముగా
వినునది కాముకులమదికి వేడుక గాదే. 41

—♦ విప్రనారాయణుండు మరల దేవదేవియింటికిం జనుట. ♦—

క. మధురములు సతులవలపులు
మధురంబులు సతులముద్దుమాటలు మిగులన్
మధురము తా వలచినసతి
మధురములు తదీయదూతిమాటలు మఱియున్. 42

వ. ఇవ్విధంబున శపథపూర్వకంబుగాఁ దన్ను నడిగిన నవ్వాడుగునకు
వినయసంభ్రమంబున గంభీరవాగ్విజృంభణంబుగా నాశంథళి యి
ట్లనియె 43

క. మాయక్క పిలువుమనియెను
మాయమ్మయుఁ బిలువుమనెను మాయయత్తోడే
మాయంబికమ్మయూనే
వే యిఁకఁ బదవయ్య యేల వేదన బొరలన్. 44

వ. నాపుడు నతండు తన మనంబున. 45

క. రమ్మనక పోదు తాల్పు-
ర్యమ్మధికము దేవదేవి కది సహజంబే
యమ్ముసలి చేరజమ్మది
రమ్మనెననుమాట నమ్మ నా చెప్పటికిన్. 46

ఆ. ముసలిదానిమాట వెస నమ్మి పోరాదు
పోవకుండరాదు దేవదేవి
రమ్మనంగ దీని కెమ్మోయినుండుఁ గా
ర్య మ్మటంచు సంశయమ్ము నొంది. 47

గీ. దైవయత్నము లేక చెందవు శుభాశు
భములు దైవంబుఁ బరిహరింపంగరాదు
ప్రాణి ప్రారబ్ధకర్మంబు దీనికేమి
కొంచ కైనట్టు గానిమ్మటంచుఁ జనియె. 48

వ. ఇట్లు చనుదెంచినయతనిం గనుంగొని దేవదేవి యిట్లనియె. 49

ఉ. ఆమె మఱేమి మంచి గురువౌయయగారవె యట్లు పోమరా
మాయలవానికి న్వలపు మాన్పు మటన్నది నిక్కమయ్యె ము
న్నాయమ యేమటన్న నగవై వినుచుందురుగాని పాటిగాఁ
జేయరు శాంతి దాల్చి గుణశీలురు మీ రలుగంగఁ జెల్లునే. 50

క. నాపేరఁ బెట్టి నిన్నును
నీపేరం బెట్టి నన్ను నిష్ఠురములు వా
చాపరుషము లాడిన నే
లోపలిలాహిరిజనంబులోఁ జరియింతున్. 51

క. మొదలె సివశెట్టి యటుపై
ముదిమది వెసఁ దప్పి కోపమున నాడిన నీ
వది గురుతు చేసికొని యరు
గుదువా నేఁ గాక యామె గుఱుతా నీకున్. 52

వ. అని యిట్లు దేవదేవి యూరడించినఁ దదీయాంబ చను దెంచి యిట్లనియె.

ఆ. నవ్వ్వ చేసికొందురి నామాట కలుగరు
వృద్ధటంచుఁ బెద్దపెద్దదొరలు
దేవరట్లమీరు శ్రీవైష్ణవులు మాయ
వజ్ఞమాట లెగ్గు పట్టఁ దగునె. 54

వ. అని యివ్విధంబున వృద్ధపిశాచి యతిశాంతురాలై సాంత్వనవచనంబులు పలుకం గనుంగొని యతం డంతరంగంబున నది యంతయు దేవదేవికిఁ దనయం దనురక్తిగలుగుట నెఱింగి పుత్రిక నతిక్రమింపలేక ప్రియోక్తులాడుటగా భావించుకొనియె. 55

క. కేవలపైత్యభ్రాంతుఁడు
భూవలయము దిరుగఁ గన్నపోలిక వశుఁడై
తావలచినట్టివానికి
స్త్రీ వలచినయట్టులుండుఁ జిత్తములోనన్. 56

వ. అనంతరంబ. 57

గీ. విటశిఖామణి యైనయవ్వటుశిఖాగు
ణికిని సంపెంగనూనియ నెలఁత శిరసు
నంటెఁ గేల్దోయి తాళంబు లతిశయిల్ల
బోడితలమీఁదఁ దాండవం బాడుచుండ. 58

గీ. ఇవ్విధంబున శిర సంటి యంగమర్ద
నంబు గావించి మాషచూర్ణంబుఁ బ్రామి
మజ్జనం బార్చి చెంగావిమడుఁగు లిచ్చి
నామములు పెట్టకొనఁ జేసి ప్రేమ నతని. 59

గీ. గంధకర్పూరకస్తూరికాపిలేప
నాదుల నలంకృతునిఁ జేసి యవలఁ దాను
శిరసు మజ్జన మాడి నల్వగుస వన్నె
దీర్చుకొని తన్మనోవాంఛ దీర్చె నంత. 60

—♦ బంగారుగిన్నె లేదని యర్చకులు జియ్యరున కెఱిఁగించుట ♦—

మ. అట రంగేశ్వరునర్చకుల్ నియత మాసద్దేవు మధ్యాహ్నమ
ప్పటినైవేద్యము వేళ దేవళములో బంగారపుంగోర నె
ప్పటిచోఁ గానక చంచలాత్ములయి లోబన్నందనం బాదిగాఁ
దటసంస్థానము లెల్లఁ జూచి యటుపైఁ దత్పాత్రి లేకుండినన్. 61

గీ వారలును దేవళపుటధికారి యైన
జియ్యగారికి విన్నవించిన నతండు
నదరిపడి లేచి మఱియును వెదకవలయు
పట్లరసియెందుఁ గానక పరితపించి. 62

క. గిన్నె యిట మున్న దేవర
సన్నిధి నేఁ గంటి వింతజను లీలోనే
కన్నపుదొంగలు వచ్చిరె
మిన్నక యీలోనివారె మ్రింగి రటంచున్. 63

క. బడిపనులవారి గొల్లల
గుడినంబుల జంగవరుసఁ గొని చేకొలఁదిన్
బడిమారెఁ దిరిదండంబున
నెడమఁ గుడి న్నారసిహా మెత్తినరీతిన్. 64

గీ. ఇట్లు గోలాహలంబుగాఁ బెట్టఁ బెట్టి
వీక నందఱ నచటు మెయ్యాఁక చేసి
ముమ్మర మ్మైనయూరివేరమ్ము మదికిఁ
బుట్టి యతఁ డేగెఁ దలవరికొట్టమునకు. 65

సీ. కొనముక్కుపైనుండి కనుబొమ్మలకు వెళ్ళ
నాభినామంబు సన్నముగఁ దీర్చి
చెవిచెంత కొరగ వేసిన కోరసికసంకు
తెల్లచెంగులబట్ట వెళ్ళఁ గట్టి
అనువు వేళ్ళను గంధమును నాభికండి
మూఁపులదాఁక బంగారుపూఁతఁ బూసి
చెఱఁగుదిక్కునఁ దోఁకచెఱఁగు దూఁచగ
నీలికాసె చే హనుమంతుకాసె వేసి
తొడవుఁ గత్తులు గుదెలును గడల నొంటి
పోకవీడెము లమర మైతే కరముల
నొంటరులుగొల్వఁ దలవరి మంటపమున
నధివసించిన దండనాయకునిఁ గాంచి. 66

వ. తీర్థప్రసాదంబు లిచ్చిన నతండు ప్రత్యుత్థానంబు చేసి యందు
కొని వేంచేసిన ప్రయోజనం బేమి యని యడిగిన నతం డిట్ల
నియె. 67

గీ. అవసరము లెల్ల ముగియ ననంతరమున
రాత్రి పవళించువేళ శ్రీరంగశాయి
యానవా లారగించు పదాఱువన్నె
బంగరపుగిన్నె పోయెను బట్టపగలు. 68

క. ఆసన్నత స్వామికి నిజ
దాసుఁడ వైనట్టినీవు తలవరివని యా
జ్ఞాసిద్ధిఁ జేయఁ గోవెల
లో సొమ్మిటు లైన నిన్ను లోకులు నగరే. 69

ఉ. పో నెడ లేదు గిన్నెఁ గొనిపోయిన మ్రుచ్చులు నూరు వెళ్ళ కీ
లోన యడంగి యుండుర్ పురిలో వెదకింపుము చీఁకటిం బర

స్నానము సేయకుండ నిఁక సన్నిధి మూఁకపరాహ్ణకాలసే
వానియమం బటున్నఁ దగువారలఁ బాపి యతండు చయ్యనన్. 70

గీ. ఊరఁ గల్గినయగసాలివారి నెల్ల
నింటివద్దకి నొండొరు నెఱుఁగకుండ
రేయిఁ బిలిపించి శ్రీరంగశాయిగిన్నెఁ
దస్కరుఁడు దీసినట్టివిధంబుఁ జెప్పి. 71

క. కంచును రాగియు వెండియుఁ
గాంచనమును మౌక్తికాదికము లగుమణులుం
బంచాణము వారిండ్లకుఁ
గొంచక కొనివత్తు రమ్ముకొనుటకుఁ జోరుల్. 72

క. అట్టియది మాకు నెవ్వఁడు
నట్టన నెఱిఁగించు వాతనికి నిచ్చెద నేఁ
గట్టినయీకుప్పటి నే
నట్టియెడన్ బ్రోచుర మతని నెన్నఁడుఁ జేయన్. 73

వ. ఇట్లు పట్టణంబునం గలలోహకారకులకెల్లఁ బ్రత్యేకంబుగా రహ
స్యంబునం జెప్ప నట్టియెడ. 74

గీ. అందు వేశ్యాగృహంబున హైమపాత్రిఁ
గన్న యగసాలిబత్తుఁ డాగిన్నెసుద్ది
నేకతంబునఁ దలవరి కెఱుకచేసి
చనియె ఘనమైన మెచ్చుఁ గైకొని ముదమున. 75

వ. దానికిఁ బ్రమోదమానమానసుండై తలవరియు నమ్మఱునాఁ డరు
ణోదయంబున. 76

సీ. చలదయఃత్రికోజ్జ్వలదండకాండముల్
ఘలుఘల్లు మనుచు ముంగలఁ జెలంగ
నునుపారఁ జికిలి చేసినవిచ్చుకత్తులు
తపనదీప్తులఁ దళత్తళ యనంగ

హనుమదాకృతులు వ్రాసినకంచుటంగలు
జాళువాచురవళిచే డాలు మించ
నదరుఁగ్రొవ్విరులమ్రోఁత కదళి నల్దిక్కుల
నార్తరావముల వాయసఘు లరుగ
ముందటను గాచుకొమ్ము మి న్నంది మొరయ
జారచోరులగుండియల్ జల్లనంగ
వెడలి కోలాహలంబుగా వేశ్యవాటిఁ
జేరి యప్పట్టణముతలవారి గాంచె. 77

వ. అందు. 78

సీ. ఎఱమట్టిపూఁతచే మెఱుఁగారుగోడలఁ
బైకిఁ గ్రింద సున్నపుఁబట్టియలును
ద్వారబాధమున సిందూరంపుబొట్లును
గడపపైఁ బసపు నక్షతలచాలు
భిత్తిభాగమునఁ గ్రొన్నెత్తుటుజిట్టలు
చూపుల మ్రాసపుఁదోరణములు
తిన్నెపై నంబికాదేవిపాత్రంబులఁ
బూజ చేసినసద్యపూర్ణఘటము
గలిగి ఘనసారకస్తూరికాసుగంధి
గంధపుష్పాక్షతార్చనబంధురాభి
నవకలశభాసిగృహదేవభవనసూచి
తేందిరం బైనయావేశ్యమందిరంబు. 79

—♦ దేవదేవియింట బంగారుగిన్నె దొరకుట. ♦—

వ. కని తదీయబహిర్ద్వారప్రదేశంబునఁ దాను నిలిచి పరివారజననివహంబు నంతర్గృహంబు శోధింపం దగువారిఁ బనిచినం జని వారును

క. అంకులఁ దగినగృహంబుల
కంచుక లన్నియును వెదకఁగా నొకచోటం

జందనపుసుందనంబునఁ
గుందనపుఁగోకఁ గాంచి కొని చని దార్కేఁ. 81

క. తలవరి యొకటం బెట్టిన
నలవేశ్యఁ దదీయమాత నగ్గిన్నియ జి
య్యాలకడకుం గొని చనఁగా
లలనామణితల్లి వారలకు నిట్లనియెన్. 82

క. ఇటు లేమి యెఱుఁగ మేమియు
విటుఁ డొక్కఁడు గిన్నె మాకు వేడుకతోఁ దా
నిట దెచ్చి యిచ్చి యింటను
విటుఁడై యున్నాఁడు దగ వివేకించవయా. 83

వ. అని విని యత్తలవరి యతనిం దోడితెం డని నిజభృత్యులం బనిచి
నం జని వారలు తదీయశయనాగారంబున నున్న యవ్విప్రనారా
యణుం గనుంగొని. 84

క. దండము దండ మిదెవ్వరు
తొండరడిప్పెడులు గిన్నెదొంగ గైనాగో
రం డిట వేంచేయుం డిదె
దండ మిడ స్వచ్ఛివాఁడు తలవరి మీకున్. 85

## తలవరి విప్రనారాయణుని గిన్నెతో జియ్యరు కప్పగించుట.

క. అని బహువిధముల సొల్లుఁ
దనముల వాడుచును దొంగ నాసామిని
గొబ్బున వేంచేయుం డనుచును
జని యతనిం జియ్యగారిసమ్ముఖమ నకున్. 85

వ. తోడ్కొనిచను యత్తలవరి వారల నక్కనకపాత్రింబుతో జియ్యల
కొప్పించిన నతండు వేశ్యం గనుంగొని యగ్గిన్నియ మీకు నేక్రియం
జేరె నటించింపుమసిన న వ్విప్రనారాయణుం జూపి యది యి
ట్లనియె. 87

సీ. ఈదాసరయ్య తా నేఁడాదినుండి
మాదేవదేవికి విటుఁడై వసించుఁ
దోఁటలో బిక్షమెత్తుచుఁ బ్రసాపడుచున్న
వాని నింటికిఁ దెచ్చి వలపుచేత
నెవరు పెట్టనుగాని యెఱుఁగ మీతనివంకఁ
బడెడుబియ్యము స్వయంపాకమునకు
నెన్నఁడు విడెమైన నియ్య నటంచును
నేనును గోపించి యిల్లు వెడలి
పొమ్మనినఁ బోయి యొక చిన్నబ్రహ్మచారి
చేత గిన్నియఁ బుత్తెంచె నాతఁ డితని
శిష్యుఁ డనియెఁ బరామర్శించుఁ డనిన
విప్రనారాయణుఁడు సభావితతి కనియె. 88

క. నా కెక్కడిశిష్యుఁడు నే
నేకాంగిని లెస్స తెలియుఁ డిదినిజమైనన్
శ్రీకాంతుని గిన్నియ నే
నీకాంతకుఁ దెచ్చియిచ్చు టిదియును నిజమే. 89

క. ఈమాటే గుఱిసేయుఁడి
యేమాటలకుం బనేమి యిఁక నాపుకు స
జ్జామాతమాటలకు వే
శ్యామాత సరోషచేతయై యిట్లనియెన్. 90

గీ. రంగఁ డనుపేరుసైత మెఱుంగఁ జెప్పి
యవ్వడుగు శిష్యుఁడను నే నటంచు వచ్చె
నతనిఁ గడు గట్టిచేసెను ననువుదొంగ
కేది గుఱి కల్లతో నిజ మెట్లు దోఁచు. 91

క. తనవంటిపిల్లనిక యే
తనకుంబలెఁ దులసిపేర్లు తనవలె నే చా

దినతిరునామము యా పీ
తనివంటి దొకింత సలు పతం డరయంగన్. 92

చ. వడి నదలించినం బడుచువాఁడు భయంబడి యేడఁ జెప్పునో
తొడిఁబడ నంచు వాని నిటఁ దోడ్కొని తేరక తానె వచ్చి యీ
గడుసరిదొంగ మ మ్మొడియఁగట్టెను శిష్యుఁడు లేఁడటంచు మున్
గుడికడ దృష్టము ల్పలుక కొండొక శోధన దీని కెమ్మొయిన్. 93

చ. తెఱవల మే మెఱుంగుదుమె తెల్లని వెల్లను బా లటందు మి
ట్లరయఁగ వేడ్కకాఁడ్రయి యుపాయమునం జెలికానిచే మముం
జెఱిచెను బాయఁ బెట్టి యిలు చేర్చెను దేవరసొమ్ముఁ దెచ్చి యీ
యఱవకువాళి యింతయు రి యానని కానక మోసపోయితిన్. 94

క. అని యిట్లు దేవదేవిజ
నని వాక్యమ్ములను విప్రనారాయణుఁ డా
డినమాటలు విని విద్వ
జ్జనముల సజ్జియ్య ధర్మసభఁ గూర్పించెన్. 95

వ. ఇట్లు గూడిన విద్వత్సభాజనులు గొందఱు విప్రనారాయణుం
గనుంగొని. 96

చ. వటుఁడవె యగ్రజన్ముఁడవె వైష్ణవుఁ డౌనవె తాను గ్రిమ్మఱి
న్నిటుఁడవె దేవతాధనము వేశ్యకు మ్రుచ్చిలి యిచ్చినాఁడవే
యిటువలె నౌను భ్రష్టుఁడు హరీ జగదీశ్వర రంగ రంగ యీ
కుటిలునిచేత వైష్ణవులకుం దలవంపులు చేసె దిక్కులన్. 97

మ. అభియాతు ల్మొద లీమతంబునకు మాయావాదు లాత్మీయదు
ర్వ్యభిచారం బది మేరువంతయిన మాయ న్మిథ్య లే దంద్రు పె
ల్లభియోగింపుదు రన్యదుష్కృతము గోరంతైనఁ గొండంతగాఁ
బ్రభువుల్ హాస్యరసప్రియు ల్మనల నీపాలైన మన్నింతురే. 98

వ. అని యిట్లు హరిదాసు లయిన శ్రీవైష్ణవజనంబులు మనంబుల
ఘనం బగు ఖేదంబు లొందుచుండ నవ్వల నితరమతంబులవా రతని
నుద్దేశించి. 99

ఉ. చోరుఁ డనంగరా దొరులసొమ్ములు ముచ్చిలినం బ్రిసన్నునిన్
జారుఁ డనంగరాదు పెలుచం బరకాంతలఁ గూడఁ డీ డనా
చారుఁ డనంగఁగూడ దనిశంబును వేశ్యలతో రమించినన్
బోరన మీర లీతనికిఁ బూనుఁడు బ్రిహ్మరథంబు వైష్ణవుల్. 100

వ. అని ప్రోల్లుంఠనము లాడుచుండి రాసమయంబున జియ్యరు సభా
సదుల కిట్లనియె. 101

గీ. పరిఁగ దేవరసొమ్ము దేవరకుఁ జేరె
దొంగ యెటు వోయె నేమి యనంగఁ జెల్ల
దరసి శిక్షింపకుండిన వాత్మ పదిల
పడదు గావున ముచ్చిచ్చి నేర్పు అపవలయు. 102

—♦ సభాసదులు విప్రనారాయణునకు శిక్ష విధించుట. ♦—

వ. అని మఱియు వేశ్యాంబపలుకులును విప్రనారాయణవాక్యంబు
లును సభాంతరంబున సవిస్తారంబుగా వారలకుం దెలిపి ధర్మంబు
లెట్లుండు ననిన వారలు దమలోన. 103

గీ. పెట్ట లే దని తర్కించునట్టి విటుని
వేశ్య లూరక పిల్తురే విత్త మీక
హేమపాత్రికఁ జూచి కాకితసపట్టె
నామములు చూచి పిలిపించినారె మరల. 104

క. వేఁడాడిబట్టి వేసుక
కాఁడై యితఁ డింట నుండెఁ గాని యితరుఁ డే
వాఁడు న్లేఁ డని యీపూ
బోఁడి యనియె నితఁడు నట్ల పొందుగఁ జెప్పెఁ. 105

క. ఈయర్థంబున గిన్నియ
నీయన యీవలయుఁ గాని యితరులకు వృథా
రోయిడఁ బనేమి యుదపద
నేయక యిది ధర్మ మని వచింపుఁడు పెద్దల్. 106

గీ. ఎవ్వరేనియుఁ గొనిపోయి యీక గిన్నె
నడిచి పోవను వారింటికడకుఁ దానె
యొరులు గొనిపోయి యొసఁగఁ బ్రయోజనంబు
గలుగ దటుగాన నీతఁ డీవలయు దీని. 107

ఉ. కొంచక రేయునుం బవలు గోవెల కీతఁడు పుష్పదండ ల
ర్పించు నెపంబునం బరిచరింపుచు నుండెనటుండి యొయ్య నే
పంచెను బొంచి యర్చకులు వద్దఁ దొలంగిన సందు చూచి లం
కించఁగ నోపునీపసిఁడిగిన్నియ సంశయ మేల దీనికిన్. 108

వ. అని నిశ్చయించి యవ్విప్రనారాయణు నాఁడుఁ జోరత్వం బాపా దించి సభాసదులందఱు నేకత్వంబున నత్తెఱంగు జియ్య కెఱింగించిన విని యతండు దీనికిం దగుశాస్తి యెట్లుండు ననిన వార లిట్లనిరి. 109

ఆ. ధనముఁ గొనుట యొండెఁ దలగొఱుగుట యొండె
నాలయంబు వెడలనడుచు టొండెఁ
గాని చంపఁ దగినకార్యంబుఁ జేసినఁ
జంపఁ దగదు విప్రజాతిఁ బతికి. 110

క. అని విజ్ఞానేశ్వరునివ
చన మున్నది గాన నట్టిశాస్తి యొకటి యీ
యన కొనరింపం దగు న
య్యనువునఁ జేయించి పంప నగు నొండెడకన్. 111

ఆ. ధనము నెరయ లేదు తల మున్నె గొఱిగించు
కొన్నవాఁడు గాన సన్నతలఁపు
లుడిగి సీమ వెడల నడచుటె శాస్త్రోక్త
శిక్ష యితని కట్ల సేయుఁ డనుచు. 112

శా. ఈమాడ్కి న్గుడిజియ్యఁగారు సభవా రేకోక్తిగా నాడఁగా
నామాటల్విని దీనసుప్రవదనుండై విప్రనారాయణుం

డీమే నేటికి దొంగ నైచనిన న న్మివ్వారైన మన్నింతురే
సీమనే సిద్ధము నాకు దేహము విసర్జింతు న్హరిప్రీతిగన్. 113

వ. అని యిట్లు తనుత్యాగంబునకుఁ గృతనిశ్చయుండై.

సీ. అరియు శీతాంశుసోదరియును నజుఁడును
వాలు పిల్లలుఁ దొల్లువాలు నగుచు
హరుఁడు నగ్రజుడు లేశ్వరుఁడు సాగరుఁడును
దేహంబు వాహంబు గేహ మగుచు
నరుఁడు కంసకృతాంతవరుఁడును మరుఁడును
మిత్రుండు శత్రుండు పుత్త్రుఁ డగుచు
హేమాబ్బు శిఖిపింఛదామంబు నామంబు
పొంబట్టుఁ దలచుట్లు బొట్లు నగుచుఁ
గౌస్తుభమణీవరంబు గంగాధురంబు
కెంపుపతకంబు పాదంబు సొంపు నగుచు
వెలయు నేదేవుఁ డాదేవు నిలిపె నాత్మ
రంగనాథుఁ ద్రిలోకాంతరంగనాథు. 114

వ. ఆసమయంబున. 115

—♦ శ్రీరంగనాథుఁడు సభకు విచ్చేయుట. ♦—

సీ. నికటాక్షశశిభాను లొసఁగ సహస్రమా
కరముల శంఖచక్రములు మెఱయ
శ్రీకాంతవక్షస్స్థలీకౌస్తుభంబున
బంగారుప్రతిమ నాఁ బ్రతిఫలింప
ఛత్రాయమాన శేష ఫణామణిప్రభ
దివనాథదీప్తులఁ బోనుగుఱుపఱుప
వాయుభక్షణమునీశ్వరులు సురలు నంఘ్రి
సరసిజంబులకును శిరసు లొగ్గ

వాసవానలయమదైత్యవరుణవాయు
వైశ్రవణశర్వగీర్వాణవరులు గొలువఁ
గరుణఁ బ్రత్యక్షమయ్యె భక్తప్రజాంత
రంగవాంఛాప్రదాయి శ్రీరంగశాయి. 116

సీ. రభటిల్లుదివ్యదుందుభినాదంబులు
గంభీరనగరావిజృంభణముగ
నటియించునప్సరఃకుటిలాలకావళి
ప్రచురవిద్యుల్లతానిచయముగను
ప్రసరించుదేవతావిసరరత్నవిభూష
లమరేంద్రచాపవిభ్రమములుగను
వడిఁ రాలుపూఁదేనెజడివానసోనలు
ధారాళధారాంబుపూరముగను
విప్రనారాయణాత్మభూమిప్రవృద్ధ
వేదనాగ్రీష్మసంతాపనోదనముగ
మెలఁగునంబరచరులనుమేఘతతులు
గురిసె నప్పుడు మందారకుసుమవృష్టి. 117

వ. అంతన విప్రనారాయణుండు నాదినారాయణదివ్యమంగళవిగ్రహంబు లోచనానందంబుగా సందర్శించి రోమాంచకంచుకితసర్వాంగుండై సాష్టాంగదండప్రణామం బాచరించి కేలుదోయి ఫాలభాగంబునం గీలించి. 118

సీ. సతతత్రయీశిఖాచరణాయ శరణాయ
పావనాయ సురాధిపావనాయ
హరిదశ్వరజనీచరాక్షాయ రక్షాయ
శంకరాయ నిజాప్తశంకరాయ
సనకాదిహృదయరంజనకాయ జనకాయ
నాయకాయ గిరీశనాయకాయ

హేలాశయనకార్ద్రివేశాయ యాశాయ
కారణాయ సదాఘవారణాయ
దేవ రంగేశ తే నమస్తే నమోస్తు
దేవ మాం పాహి పాహి త్వమేవ శరణ
మన్యదైవం వినా త్వా మహం నవేద్మి
సర్వసాక్షీ భవాన్ నసుప్తమపివేత్సి. 119

క. క్షుధరధనుర్ధరముఖ్యా వి
బుధరాజస్తుత్య మిమ్ముఁ బొగడ నవిద్యా
స్పదుఁడనే నెఱుఁగ నే
నధరస్పందన మొనర్ప నఖిలాధీశా. 120

క. నాపయిని దేవతావి
త్తాపహరణనింద ప్రాప్తమైనది దీనిం
బాపి విమలాత్ముఁ జేయు ద
యాపర లక్ష్మీశ త్రిభువనైకనివేశా. 121

వ. అనిన నద్దేవుండు కోవెలపారుపత్తెంబున నధికారి యైన జియ్యరున
కిట్లనియె. 122

క. లీలావినోదమునకై
యీలాగున నేను వీరి నిరుపుర రతిరా
ట్కేళిం గూర్చితి మద్వన
మాలిక యితఁ డప్సరఃప్రమద యీసతియున్. 123

క. కోవెల నుండఁగఁ గైకొని
యీవెలఁదికి గిన్నె నేన యిచ్చితి నది గై
కో వచ్చునె మరలఁగ నా
యావికిఁ దిరుగాడుఁ గలదె యెప్పటికైనన్. 124

వ. అని యానతిచ్చి సకలజనులు గనుంగొన నయ్యాదినారాయణుండు విప్రనారాయణుశరీరంబునఁ బ్రవేశించె నందుల కాశ్చర్యధుర్యులై యఖిలజనంబు లతని కత్యంతభయభక్తివినయసంభ్రమంబులం బునఃపునరభివందనంబు లాచరించి రంత. 125

గీ. బ్రహ్మసభ యెల్ల భక్తి నప్పరమవైష్ణ
వోత్తముని బ్రహ్మరథమున నునిచి పట్ట
ణమున కేగించి రధికసంభ్రమము మీఱ
జియ్య ముందఱికొమ్మునఁ జేరి మోవ. 126

గీ. ఇవ్విధంబునఁ బట్టణం బేగి రంగ
ధాముని సన్నిధి కరిగి యతండు దండ
వత్ప్రణామంబు లిడి తిరువాయిముడిప్ర
బంధసూక్తుల వినుతు లర్పణ మొనర్చె. 127

శా. ఆహాధాత్మవయోమదాంధతను శంకాతంకముల్ లేక స్వే
చ్ఛాఖేలి న్నను నేనొనర్చినయనాచారంబు లోఁగొంటి నీ
కారుణ్యంబున కేది మేర యని వక్కాణింతు రంగేశ యో
శ్రీరంగేశ్వర శాశ్వతశ్రుతిశిరస్సింహాసనాధీశ్వరా. 128

శా. శ్రీరంగత్కుచకుంభపాళి శిఖరోచిర్మండలిన్ దగ్ధపా
థోరాశిన్ దుఃసీసనంబునఁ ద్రిపాదూర్ధ్వాశ్రిన్ బలెన్ మన్మనో
గారాప్తి న్వసియించి సంస్మరణదుఃఖంబు న్నివారింపు మో
శ్రీరంగేశ్వర శాశ్వతశ్రుతిశిరస్సింహాసనాధీశ్వరా. 129

వ. అనుచు సన్నుతించినఁ బునఃప్రసన్నుండై యతండు కోరినయట్లు యొసంగి యద్దేవదేవుం డిట్లనియె. 180

క. పసజభవవంశవర్ధన
ఘన మగుసీపుష్పమాలికాకైంకర్యం
బున నీకుఁ గల్గు సంతత
మును మత్సామీప్యపదవి ముల్లోకములన్. 131

వసుధ న్నామకగోపికాజనరతివ్యాపార మేలీల వే
దశమంబై వెలసెం దదీయసరణిం ద్వత్పుణ్యచారిత్రము౯
దెసలం బ్రస్తుతి కెక్కుఁ దీని విని౯ విన్పించిన న్వ్రాసిన౯
రసనం బేర్కొనఁ గన్నవారలకు మద్రాజ్యంబు నే నిచ్చెద౯. 132

—♦శ్రీరంగనాథుఁడు విప్రనారాయణున కాళ్వారునామమిచ్చుట♦—

గీ. అనఘ తొండరడిప్పొడియనఁగఁ బరఁగు
నీకు నాళ్వారిపేరు నాఁ గాక యనియె
నతఁడు తొండరడిప్పొడియాళువార
లనఁగఁ బ్రఖ్యాతిఁ జెలువొందె నవనియందు. 133

గీ. జియ్యరును దేవదేవికి నెయ్య మొనఁగ
విహితవస్త్రాభరణసమన్వితము గాఁగఁ
గనకపాత్రి సమర్పించి యనుపుటయును
నత్తలిరుఁబోఁడియు విరక్తచిత్త యగుచు. 134

క. పెరుమాళ్ళకు నాగిన్నియ
యిరుమడుగులపసిఁడి గాన్కయిడి తన కదియే
తిరువారాధన గాఁ గొని
సిరివరు రంగేశ్వరుని భజింపుచు నుండెన్. 135

ఉ. న్యాయగుణప్రదీపన వనచ్ఛవిలజ్జిత భారతీధవా
వ్యాయతనవ్యదేహ చరణాబ్జకృతాంకిత తన్విదేహ య
త్యాయతబాహుదండ విహితాహవచండ సుబాహుదండ గా
ధేయమఖాధ్వరక్షణ సుధీజనబోధన యాధ్వరక్షణా. 136

క. దశరథరాజపురాజ
న్మశతకృతాగణ్య పుణ్యమందార ఫలా
స్వశరీర చాపటంకా
రశరద్గ్రాజితేంద్ర రాజమృగేంద్రా. 137

సుగంధివృత్తము. పాదపాంసుపాలితాశ్మపాదదారవేదనా
వేదనాతదీతాభివేద్యభృత్సనాదితా
నాదితాంగజారిచాపనాథవేదిజాలకా
వేదిజాలకాంక్షితాభివృద్ధకల్పపాదపా.

గద్య.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్ర పవిత్ర
శ్రీరామచంద్రకరుణాతరంగితవైభవ సారంగునృసింహా
మంత్రిపుంగవతనూభవ పరిచితభగవద్భాగవతకైంకర్య
విధాన తమ్మయాభిదాన ప్రణీతంబైన
వైజయంతీవిలాసం బను మహాప్ర
బంధంబునందుఁ సర్వంబును
జతుర్థాశ్వాసము.
సంపూర్ణము.







## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B179 |
| పుస్తకం పేరు | వైజయంతీవిలాసము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 115 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |